బొమ్మల

బాబాసాహెబ్

# డా॥ బి. ఆర్. అంబేద్కర్

(1891 - 1956)



మలయశ్రీ

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్ * విజయవాడ-520002

# మా స్వంత ప్రచురణలు

రామ్మలం శ్రీ షిర్డీసాయి జీవితచరిత్ర
" అక్బర్ బీర్బల్ వినోదకథలు
" తెనాలి రామకృష్ణుని సంపూర్ణ హాస్యకథలు
" అలీబాబా 40 దొంగలు
" అల్లావుద్దీన్ అద్భుతదీపం
" గలివర్ సాహస యాత్రలు
" శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న కథలు
" భట్టి విక్రమార్కుని సాహసకథలు 2 భాగాలు
" జాతకకథలు
" మొగల్ సామ్రాజ్య కథానాయకులు
" ప్రవక్త మహమ్మద్
" ఏసుక్రీస్తుకథలు
" మదర్ థెరిస్సా
" రవీంద్రనాథ టాగూర్
" యోగి వేమన
" భగత్ సింగ్
" అంబేద్కర్
" యశపాల్ కపూర్
" భగవతీచరణ
" సుభాష్ చంద్రబోస్
" చంద్రశేఖర అజాద్
" జయప్రకాష్ నారాయణ్
" సంఘసంస్కర్త రాజారామమోహనరాయ్
" పూజ్య బాపూజీ

బొమ్మల పంచతంత్రం (2 భాగాలు)

" రామాయణం

" భారతం

" భాగవతం

" దశావతారాలు

" శ్రీకృష్ణలీలలు

" పరమానందయ్య శిష్యులు

" శ్రీ వెంకటేశ్వరలీలలు

" శ్రీ అయ్యప్పలీలలు

" శ్రీరామపట్టాభిషేకం

" జై వీర హనుమాన్

" పల్నాటివీరచరిత్ర

" బాలనాగమ్మ

" శ్రీ కాళహస్తిమహాత్మ్యం

" శ్రీశైలక్షేత్ర మహాత్మ్యం

" శ్రీ సింహాచలక్షేత్రము

" శ్రీ యాదగిరి నరసింహస్వామి చరిత్ర

" శ్రీ కాశీ రామేశ్వర మహిమలకథలు

" కోటప్పకొండ చరిత్ర

" శ్రీ వినాయక విజయము

" శ్రీ భద్రాచల మహాత్మ్యం

" శ్రీ పాండురంగలీలలు

" శ్రీ రాఘవేంద్రలీలలు

" కనకదుర్గ మహాత్మ్యం

" శివలీలలు

"ప్రజ్ఞ, కరుణ, సమత, సుగుణాలు కలిగివుంది కనుకనే నేను బౌద్ధ ధర్మాన్ని స్వీకరించాను మరే మతములో కానీ ఈ గుణాలు కానరావు. బౌద్ధం ఆ సుగుణాల పాఠం బోధిస్తుంది. దీనిలో గ్రుడ్డి నమ్మిక-మూఢ విశ్వాసాలు, సాంప్రదాయిక వాదానికి స్థానంలేదు. సామాజిక, ఆర్థిక, రాజకీయ స్వతంత్రతలనే మానవులకు అది ప్రబోధిస్తుంది పైగా-స్త్రీ పురుషుల మధ్యకూడా స్వేచ్ఛా సమానతలను నెలకొల్పుతుంది. సామ్యవాదం తెచ్చే మార్పు హింసద్వారా. బౌద్ధం సాధించే మార్పు హింసతోనో రక్తం ప్రవహింపజేస్తూనోకాదు-శాంతితోసాధిస్తుంది. కార్ల్‌మార్క్స్ కాదు కరుణతో తెస్తుంది."

డా॥ బి. ఆర్. అంబేద్కర్

# డా॥ బి. ఆర్. అంబేద్కర్ సుప్రసిద్ధ ఆంగ్ల రచనలు

1. మానిఫెస్టో — షెడ్యూల్డు క్యాస్ట్స్ ఫెడరేషన్
2. నీడ్ ఫార్ చెక్స్ అండ్ బ్యాలెన్సెస్
3. బుద్ధుడు మరియు బౌద్ధం
4. ఇండియాలో కుల వ్యవస్థ
5. రనడే - గాంధీ - జిన్నా
6. కాంగ్రెస్ మరియు గాంధీ అస్పృశ్యుల కోసం ఏం చేశారు ?
7. శూద్రు లెవరు ?
8. అంటరాని వాళ్ళు
9. బుద్ధుడు — బౌద్ధం భవిష్యత్తు
10. భాషా ప్రయుక్త రాష్ట్రాలు — సమాలోచనలు

"మానవ సమాజంలో దుఃఖం వుంది. దాన్ని తొలగించాలి. ప్రజలు సుఖంగా జీవించాలి సమాజం, ప్రజాస్వామ్యం అనడానికి ముందు ప్రజలలోని అజ్ఞానం, దారిద్ర్యం గురించి మన హృదయాల్లో సానుభూతి పెంచుకోవాలి. దరిద్రం ఒక సామాజిక రోగం పాలకులు చిత్తశుద్ధిగా శ్రమించి నప్పుడే ప్రజాస్వామ్యం సఫల మవుతుంది. ప్రజాతంత్రం భావాలకు వ్యతిరేకులు లేదా నిర్లిప్తులు అయిన వారి చేతుల్లోకి ప్రజాస్వామ్య ప్రభుత్వాధికారం పోగూడదు. అలాంటి వారితో ప్రజాస్వామ్య వాదం ఆచరణకు రాదు, సరికదా-దోపిడీ గాళ్ళకు రక్షణ యేర్పడుతుంది. దేశ-సమాజ ఆర్థిక వ్యవస్థ అధిక వస్తూత్పత్తి పెంపొందేలా చేయాలి. ధనికుల చేతుల్లోకి సంపద చేరేలా వుండకూడదు. దేశ ఆదాయం ప్రజలం దరికీ సమానంగా పంపిణీ కావాలి ఇక్కడి ధనికులు ప్రజాస్వామ్య పక్షంలో లేరు-"

—అంబేద్కర్.

నాడు భారత రచనకోసం శూద్రుడైన వ్యాసున్ని వేడుకున్నారు. నేడు భారత రాజ్యాంగ రచనకోసం హరిజనుడనైన నన్ను ఆశ్రయించారు



పీడింప బడుతున్నవాళ్ళు రాజ్యాంగాన్ని విప్లవాత్మకంగా మార్చుకోవల్సిన గురుతర బాధ్యత వుంది. అది ఎంత త్వరగా సాధించితే అంత తొందరగ దేశానికి క్షేమం కలుగుతుంది



దౌర్భాగ్యం వల్ల నేను హిందూ సమాజంలో జన్మించాను. అది వశంలో లేని అంశం. కాని, నేను హిందువుగా మాత్రం మరణించను. అది స్వాధీనంలో వున్న విషయం.

డా|| అంబేద్కర్

# అంబేద్కర్—

బాబాసాహెబ్ డా॥ భీంరావ్ అంబేద్కర్ గొప్ప విద్యావంతుడు మహామేధావి ప్రఖ్యాత న్యాయవాది భారత రాజ్యాంగ నిర్మాత బహుభాషా వేత్త

ఆయన జీవితమంతా సంఘర్షణలతో నిండి ఉంది విశ్రాంతి లేని పోరాటం సాగించిన సంఘ సంస్కర్త కరుణామయుడు, మానవతావాది ఆయన దారిద్ర్యాన్ని ద్వేషించాడు సమతను జన సంక్షేమాన్ని కోరుకున్నాడు అందుకోసం ఆయన ఎన్నుకున్నది శాంతిమార్గం ఆందోళన చేసి బాధితులు తమ హక్కులు సాధించుకోవాలి అని అన్నా - హింసను అంగీకరించలేదు, రక్తపాతాన్ని మెచ్చని కరుణామయుడు కనుకనే తన చివరి దశలోనైనా బౌద్ధధర్మాన్ని స్వీకరించాడు భారతదేశాన్ని ఈజాతిని ఆయన ప్రేమించాడు కాని, హిందూమతంలోని వర్ణ వ్యవస్థను అంగీకరించలేకపోయాడు పైగా అసహ్యించుకున్నాడు ఒక అంటరాని కులంలో పుట్టి అత్యున్నత విద్యార్జన కావించినా, ఉన్నత పదవులు చేపట్టినా తాను పుట్టినకులం కారణంగా సమాజంలో ఎదురైన అవమానాలను గుండెలో దాచుకున్నాడు తనకేకాదు తనలాంటి లక్షల కోట్ల భరత జాతీయులకు బాధా విముక్తికావించాలని స్థిరనిర్ణయం తీసుకున్నాడు

ఆ కాలంలో హరిజనులపై అత్యాచారాలు బాగా జరిగేవి ఈ కాలంలో తక్కువ గనకనా? వార్తా పత్రికల్లోని పతాకా శీర్షికల్లో అవే కన్పిస్తున్నాయి కదా! మందిరాలకు రానిచ్చేవారు కాదు అంటరానితనం అంటురోగం బలంగా వ్యాపించి ఉందేది ఆ చర్మకారులను, శ్రమజీవులకు, పంచమని అస్పృశ్యుల ముద్రపడిఉంది గ్రామం వెలుపల నివాసం కష్టప్రదమైన జీవనం వారికి అడుగడుగున ఎదురయ్యే

కష్టాలు కన్నీళ్ళు చూసి అంబేద్కర్ జాలిగుండె చలించింది ద్రవించింది. తన వారి స్థితి-గతిని మెరుగు పరచరానికి జీవితాంతం శ్రమించాలని దృఢప్రతిజ్ఞ తీసుకున్నాడు. కరుడుగట్టిన స్వార్థ సంకుచిత హిందూ సమాజంతో తీవ్రంగా పోరాడాడు.

ఇతరుల సంగితి వదలండి అంటరానివాళ్ళనుహిందువులేననిఅంగీకరించడానికి గాంధీజీ మొదట తటపటాయించాడంటే ఆకాల ప్రభావాన్ని గమనించవచ్చు ఆ తర్వాత అస్పృశ్యులనబడే వారిని హరిజనులని మరో ముద్దుపేరుకు బానిసలను చేశాడు. కాని వారిని పురజనులతో సమానంగా భావించే ధైర్యం లేకపోయింది అప్పటి కాంగ్రెసుకు ఉద్యోగాల రిజర్వేషన్ల ప్రయోజనాల నాశించి ఇప్పటికి వాళ్ళు హిందూ సమాజంలో పూర్తిగా విలీనం కాలేకపోతున్నారు. పల్లెల్లో ప్రాచీన వృత్తిధర్మాల కారణంగా ఆర్థిక పరిస్థితులు దిగజారి ఉన్నందుననూ వారి తేడా ఇంకా కొనసాగుతూవున్నది. ఈ వచ్చిన మార్పైయినా డా॥ అంబేద్కర్ గారి కంటి చలవవల్ల, గుండె బలంవల్ల జీవన త్యాగంవల్ల

స్వతంత్రానికి పూర్వం నుంచే షెడ్యూల్డు కులాలవారి సాంఘిక సమానతలకు, రాజకీయ ప్రవేశానికి, విద్యా ఉద్యోగాది రంగాల్లో ప్రవేశం కల్పించడానికి ప్రభుత్వంతో తీవ్ర పోరాటం సాగించాడు రెండు రౌండు టేబిల్ సమావేశాల్లోనూ దళిత జన పక్షంగా పాల్గొన్నాడు. ఒక మేధావిగా సంఘ సంస్కర్తగా భారతదేశ చరిత్రలో డా॥ అంబేద్కర్ పేరు చిరస్థాయిగా నిలిచి ఉంటుంది

## జన్మస్థలం - జాతి

మహారాష్ట్రంలోని రత్నగిరి జిల్లాలోని అంబవాడ అనే గ్రామముంది.

అది కొంకణ ప్రాంతం అక్కడ మాట్లాడేది కొంకణీ భాష గోవా ప్రాంతానికీ అదే మాతృభాష. ఇప్పుడా ప్రాంతం కర్నాటక రాష్ట్రంలో చేరిఉంది

అక్కడ "మహర్" అనబడే "పంచముల" ఇంట్లో అంబేద్కర్ జన్మించాడు మహర్‌లు హరిజనులు వారిది వీరజాతి శ్రమజీవులు. మహారాష్ట్రలో మహర్‌లు లేని గ్రామంలేదు రాష్ట్ర జనాభాలో నూటికితొమ్మిది- పది శాతము వాళ్ళే ఆంగ్లేయ సేనలో, స్వతంత్ర భారతసేనలోనూ మహర్లవి ప్రత్యేక పటాలాలుండేవి ప్రథమ, ద్వితీయ ప్రపంచ యుద్ధాల కాలంలోనూ వారు పేరుపొందిన సైనికులు

ఆర్యులకంటె ముందుగానే మహారాష్ట్రకు చేరుకొన్న ఈ తెగ ఆర్యులతో యుద్ధాలు చేశారని కొందరంటారు. మొదట క్షత్రియులే అయినా కాల క్రమాన రాజ్యాలుపోయి ఆస్తులు చెడి మామూలుస్థాయికి చేరుకొన్నారని మరి కొందరంటారు

డా॥ అంబేద్కర్ పరిశోధించి ప్రకటించిన విషయం ప్రకారం వారు స్థానికులు, ఆదివాసులు, భూమిపుత్రులు, అంటే వ్యవసాయాన్ని నమ్ముకొని జీవించిన వారన్న మాట

ఇప్పటికి గ్రామాల్లో భూమి తగాదాలు వస్తే మహర్లేన్యాయ నిర్ణేతలుగా వ్యవహరిస్తారు అంటే భూముల కొలతలు గట్లు స్థానికులకే కదా పరిచయమై ఉంటవి

శవాలను కాల్చడానికి శ్మశానాలకు కట్టెలు చేర్చడం, చచ్చినపశువులను తీసుకెళ్ళి చర్మాలుతీసి శుభ్రంచేసి భద్ర పరచడం, గ్రామాధికారులు చెప్పిన విషయాలను ఊళ్ళో డప్పు చాటింపు వేయడం, వాళ్ళుచేసే ముఖ్యమైన పనులు,

గ్రామ సుంకరులుగను ఆ జాతివారు నియమింపబడేవారు వ్యవసాయ కూలీలుగా స్త్రీలు- పురుషులు రైతులకు సహకరించేవారు

అయితే వారికి అంటరానివారనే ముద్రవేసింది సమాజం అగౌరవం గానూ చూసింది

పనిచేయని వారే ఎక్కువని, పనిచేసేవారేతక్కువనే తప్పుడుసిద్ధాంతం అమలుపరిచింది అది అంబేద్కర్ మనస్సునుచాల బాధించింది ఆస్తులు అధికారులు కలవారు,నాడు స్వార్థంతో విధించిన శాసనాలను విధిలేక భరించారు వాళ్ళు భారత దేశంలోఎన్నెన్నో అంటరాని వాళ్ళ తెగలున్నాయి ఇంచుమించు వారందరిదీ ఇదేపరిస్థితి

మనం విచారించ వలసింది కొన్ని వృత్తుల వారిని హీనంగాచూస్తున్న సాంఘిక పరిస్థితికి- వారి ఆర్థిక దుస్థితికి, వారిని సంఘంలో సమానస్థాయికి తెచ్చేం దుకు కృషి సలపాలి.

అలాంటి దిగువజనం బాధలను కళ్ళారాచూసి తాను అనుభవించివాటిని తొలగించడానికి అవిశ్రాంతి కృషి సల్పిన మహనీయుడు మన అంబేద్కర్

## తల్లిదండ్రులు

పైన పేర్కొన్న "అంబవాడ" మహర్ పరివారంలోని వ్యక్తిరాంజీ సక్పాల్ అతని తండ్రి పేరుతో కలిపి రాంజీమాలోజీ సక్పాల్ అలా పిలవటము మర్యాద సాంప్రదాయం ఆయన మిలిటరీ ఉద్యోగం చేస్తూమధ్యప్రదేశ్‌లో ఉన్నాడు చాలకాలం

రాంజీ భార్య భీమాభాయి ఆదర్శ గృహిణి బాయి అంటే మరాఠీ భాషలో స్త్రీ లేదా అమ్మా అని అర్థం

వారికి బలరాం, ఆనందరావు అనే కొడుకులు, మంజుల, తులసి అనే ఇద్దరు కూతుళ్ళ తర్వాత అయిదవ సంతానంగా అవతరించాడు మన కథానాయకుడు అంబేద్కర్



అంబేద్కర్ అనేది ఆయన ఇంటిపేరు ఈ బాలుకు పితరులు పెట్టుకున్న పేరు సకపాల్, బాల్యదశలో ఆ బాలుని దుడుకు చేష్టలకు భీమ్‌రావ్ అనే పేరుతో పిలిచేవారు అంబావాడ్కర్ అనే ఇంటిపేరును తెలిసో తెలియకో స్కూల్ మాస్టర్ అంబేద్కర్‌గా మార్చివ్రాసాడు అప్పటి నుంచి ఆయనపేరు భీంరావ్ రాంజీ సక్పాల్ అంబేద్కర్ అయింది బి ఆర్ అంబేద్కర్ అని పిలిచేవారు

## మాతా వియోగం—

భీమారావు రెండేండ్ల వయసులో ఉండగా తండ్రి ఉద్యోగ విరమణ చేయవలసి వచ్చింది సతారా దగ్గర నివసిస్తూ చిన్న ఉద్యోగం చేసుకుంటూ, రాంజీ బహుకష్టంగా కుటుంబ నిర్వహణ కొనసాగించుకునేవాడు ఆయన కబీరుదాసు భక్తుడు-

స్వామీ నాకు ఇంతమాత్రం ఇస్తేచాలు- దానితో నా యింటికివచ్చే సాధులు ఉపవాసం ఉండకూడదు-నేనూ పస్తుండకూడదు— అనే కబీరు తత్త్వము రాంజీది

భీంరావ్‌కు ఆరేళ్ళ వయసు రాగానే బడిలో చేర్చారు

అదే సమయంలో అకాల మృత్యువాత పడింది ఆయన తల్లి భీమాబాయి

తండ్రికి రాంజీకి వేదాంతం కబీరుభక్తి మరింత పెరిగిపోయింది భీం రావును అక్కలిద్దరూ ప్రేమతో చూసుకునేవారు వారికి అప్పటికే పెళ్ళిళ్ళయినవి

రాంజి కొడుకులను క్రమశిక్షణతో పెంచాడు ఆ సిపాయి ఆరేళ్ళ జీవితంలో సంపాదించుకున్నది ధనం కాదు- క్రమశిక్షణ, మంచిపేరు ఆయన మాంసం ముట్టేవాడు కూడాకాదు అంతటి సాత్వికుడు

## కులద్వేషానికి బీజాలు—

ఎవరైనా బాల్యంలోని అనుభవాలు మరచి పోలేం అనేకులు ప్రముఖులు బాల్యంలోని అనుభవాల కారణంగానే మహత్తరమైన నియమాలు తీసుకోవడం ఆ తర్వాత పట్టుదలతో వాటిని సాధించటం జరిగింది అంబేద్కర్ విషయంలోనే అవే నిజమయింది

ఒకసారి అన్నతో కలిసి పొరుగూరికి పోతూ, దాహంవేసి దారిలోని ఓ గ్రామంలో ఒక గృహస్థును మంచినీళ్ళడిగారు అతడు వీరి కులం పేరడిగి తెలుసుకొని నీళ్ళుఇవ్వడానికి నిరాకరించి వెళ్లమన్నాడు వీరు ముడితే పాత్ర మైల నీరు పడితే వాకిలి మైల చిందిపైన పడినా తాను మైల మలిన మనస్కులకు ఎన్ని మైలలు!

వారు అలాగే దప్పితో వెళుతూ దారిలో ఒక ఎడ్లబండి మనిషితో బేరమాడి బండెక్కిపోతుండగా, ఆ ఆసామి వీరి కులం విషయం తెలుసుకొని కోపంతో దించేశాడు ఆ ఎండలో ఆ పసిప్రాణం ఎంత విలవిల్లాడిందో-



బడిలోనూ అంతే తరగతి గదిలో మిగతా హిందూ బాలురకు బెంచీలు, తాము దూరంగా నేలపై కూర్చునేవారు ఒకనాడు పిల్లలకెవ్వరికీ రాని లెక్క

అంబేద్కర్ చేశాడు నల్లబల్లపై చేసి చూపమన్నాడు మాస్టారు అయితే ఆ బోర్డును తాకవద్దన్నారు విద్యార్థులు- దాని వెనక ఉన్న చద్దులు మైలపడతాయని ఉపాధ్యాయుడు కూడా అదే ఆచారాల్లో పెరిగిన వాడయ్యె. మౌనంగా నిలిచాడు భిన్నుడై దూరం జరిగాడు అంబేద్కర్

మంగలి వద్దకు క్షవరానికి పోయినా అంతే చాకలికి గుడ్డలు వేసినా- నీటి రేవు వరకు పిరే బట్టలను తీసుకెళ్ళి నీటిలో తడిపి ఉతకడానికి ఇచ్చి రావడం ఆంధ్రప్రదేశ్‌లో ఆచారంగా ఉండేది నాడు అక్కడా అంతే అయి ఉంటుంది

మనిషిగాపుట్టి సాటి మనిషిని మనిషిగా చూడలేని ఈ హిందూ సమాజ విధానంపై, కులాచార పద్ధతులపై బాల్యం నుంచే వెగటు ద్వేషం ఏర్పడ్డాయి అంబేద్కర్‌కు ఆయన వయసు పెరిగినా కొద్ది అది మరింత ఎక్కువయిందే కాని తగ్గలేదు అందుకు కారణం మన సంకుచిత సమాజమే

## విద్యాభ్యాసం-

ప్రాథమిక విద్య పూర్తికాగానే ఉన్నత పాఠశాలలో చేరాడు బి ఆర్ అంబేద్కర్

పిల్లలను పోషిస్తూ ఉద్యోగం, పని చూసుకోవడం రాంజీకి కష్టమైంది మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు, ఆ వయస్సులోనూ ఇచ్చే వాళ్ళున్నారు గనుక

అంబేద్కర్‌కు తండ్రి చేసిన పని ఎంత మాత్రం ఇష్టంగా లేదు ఉన్న దారిద్ర్యానికి తోడు మరో తోడు సవతితల్లి, ఆమెకూ పిల్లలు కలుగవచ్చు ఆ స్థితిని ఊహించుకోలేకపోయాడు తాను వద్దన్నా ఆగని వ్యవహారం ఆ వాతావరణం నుంచి తప్పించుకొని బొంబాయి వెళ్ళిపోవాలనుకున్నాడు

సతారా రైల్వేస్టేషనులో మూటలు మోస్తూ కూలీ డబ్బును దారి ఖర్చులకోసం సమకూర్చుకోసాగాడు అదీ ఎంతోకాలం సాగలేదు కొన్ని రోజుల్లోనే మేనత్త చూసి కోపగించి అంబేద్కర్‌ను పిలుచుకు వచ్చి తండ్రికి అప్పగించింది

మళ్ళీ అక్కడే వుండి చదువుకోసాగాడు

పిల్లవానికి చదువుపై ఆసక్తి ఉన్నదని గమనించి రాంజీ ఎలాగయినా ఒరే చదివించాలనే నిర్ణయానికి వచ్చాడు తన మకాం బొంబాయికి మార్చాడు—

## బొంబాయిలో—

ఏదో పనిచేస్తూ ఆ వచ్చిన సంపాదనతో రాంజీ గడ్డుగా సంసారం వెళ్ళదీయసాగాడు అయినా కొడుకును శ్రద్ధగా చదివిస్తున్నాడు ఒంటి గది కావటం కనుక అందరు నిద్రించిన తర్వాత కొడుకును లేపి చదువుకొమ్మనేవాడు

బొంబాయి పెద్ద పట్టణమైనా అక్కడ కూడా అంటరానితనం మహామారిలా వ్యాపించి ఉంది ఆదర్శవంతులైన అధ్యాపకులు కొందరున్నా పిల్లల ప్రవర్తనలను అదుపు చేయలేకపోయేవారు

ఐచ్ఛిక విషయం సంస్కృతం తీసుకుంటానని కోరాడు అంబేద్కర్ అందుకు ఆ భాషా పండితుడు అంగీకరించలేదు సంస్కృతం గీర్వాణ భాష, అంటే—దేవభాష అని భూదేవతల అభిప్రాయం దానిని శూద్రులే చదువకూడదని శాసనం ఇక పంచములు చదువుతామంటే అంగీకరిస్తారా? కాని, అంబేద్కర్‌కు సంస్కృతం చదవాలనే కోరిక మిక్కుటంగా ఉంది దానివల్ల భారత పురాతన సాహిత్యాన్ని చదువవచ్చునని, ఇంకా తమ జాతిని ఇంత దిగువగా ఉంచడానికి

కారణాలేమిటో తెలుసుకోవాలనీ ఆసక్తిగా ఉంది అప్పుడు కాకున్నా ఆ తర్వాత పట్టుబట్టి తన కోరికను నెరవేర్చుకున్నాడు.

బొంబాయి పెద్ద పట్టణం కనుక తోటి విద్యార్థులతో కల్సి బెంచీలపైనే కూర్చునేవాడు అయినా ఇతర హిందూ బాలురు అంటిముట్టకుండానే మెదిలేవారు




ఒకసారి హోటల్‌కు టీ త్రాగటానికి వెళ్ళితే, ఆ యజమాని ఇతని కులం అడిగి విని మెడపట్టి బయటకు త్రోసాడు వెళ్ళి వీధిలోని బురదగుంటలో పడ్డాడు అంబేద్కర్.ఆ తరుణ యువకుని హృదయం ఉద్రేకంతో నిండిపోయింది. దుఃఖం పొంగి వచ్చింది కన్నీరు కార్చాడు చేయని నేరానికి కులవ్యవస్థ విధించిన శిక్షకు ఎంతగానో కుమిలిపోయాడు చదువు మానలేదు

1907లో మెట్రిక్ ప్యాసయ్యాడు తండ్రి ఆనందానికి అంతులేదు ఆ కాలంలో ఆ జాతిలో అదొక ఘనకార్యం

బొంబాయి సంఘ సంస్కర్తలు అంబేద్కర్‌కు సన్మానం జరిపారు. అభివృద్ధి చెందుమని, విద్యాధ్యయనం కొనసాగించవలసినదనీ విశాల హృదయులు ఆశీర్వదించారు, ఆకాంక్షించారు-

ఆనాడే "కొలుస్కర్ అనే మరాఠీ పండితుడు ప్రేమతో అంబేద్కర్‌కు "బుద్ధుని జీవిత చరిత్ర'ను బహూకరించాడు అది ఆతనకు మార్గదర్శకమైంది

## పెళ్ళి జరిగింది -

అంబేడ్కర్ కావాలనుకోకున్నా ఆయన పెళ్ళి ఆయన ప్రమేయం లేకుండానే జరిగిపోయింది అన్నలిద్దరూ వివాహాలై వేరు కాపురాలు పెట్టిఉంటారు అక్కల లగ్నాలు సొంత తల్లి ఉండగానే అయినై ఇక ఈ అబ్బాయి పెళ్ళిచేస్తే తన భారం దిగిపోతుందని భాదించి ఉంటాడు రాంజీ అది బాల్య వివాహాలు జరిగే కాలం

వాలంకర్ అనే పోర్టర్ కూతురు రమాబాయితో అంబేద్కర్ వివాహం అతి నిరాడంబరంగా జరిగింది వేడుకలకు డబ్బులేదు విడిదికి స్థలంలేదు రాత్రి వేళ ఖాళీగా ఉండే చేపల అంగట్లో ఓనాడు పరిమంది బంధువులను పిలిచి కొడుకు పెళ్ళి అయిందనిపించాడు రామ్‌జీ వధువు రమాబాయి- తండ్రి మాదిరి వలెనే భక్తురాలు, సదుణవతి, భర్త సేవలో కాలం గడిపేది ఆమె అర్ధాంతరంగానే మరణించడం జరిగింది

## కాలేజీ చదువు—

రాంజీకి ఎన్ని కష్టాలు వచ్చినా కొడుకు చదువు ఆపాలని లేదు అంబేడ్కర్‌కూ విద్యపై విపరీతమైన ఆసక్తి ఉంది బొంబాయి ఎలిఫిన్‌స్టన్ కాలేజీలో ఎఫ్.ఎ లో చేరాడు. ఎన్ని కష్టాల నెదుర్కొంటేనేం ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు.

బి.ఏ. చదవాలని కుతూహలంగా ఉంది తండ్రి నిస్సహాయత తెలుసు ఎలా? అనే ఆలోచనకు లోనయ్యాడు.కౌలుస్కర్ పండితుడు అంబేడ్కర్ విషయం

బరోడా మహారాజా శాయాజీరావ్ గైక్వాడ్‌కు తెలిపాడు అబ్బాయి తెలివితేటలను పరీక్షించి ఆయన సంతృప్తి చెంది నెలకు 25 రూ॥ ఉపకార వేతనం ఏర్పరిచాడు. ఆ కాలంలో అది తక్కువ కాదు, ఈ కాలంలో కొన్ని వందలతో సమానం

శ్రద్ధగా చదువుకొని అంబేద్కర్ 1912లో బి ఏ లో బంగారుపతకం సాధించాడు।

## తండ్రి మరణించాడు —

తండ్రి మరణంతో అంబేద్కర్ తలపై కుటుంబ భారం వచ్చిపడింది



1913లో రాంజీ సక్పాల్ కదతేరాడు ఆయన జీవితకాలమంతా కష్టాల

తోనే గడచిపోయింది ఆంగ్ల ప్రభుత్వంలోని వీరసైనికుడు అయితే మాత్రం? జీవితంలో సామాన్య తరగతి దిగువస్థాయి మానవుడు జీవిత పోరాటంలో అలసి సొలసి శాశ్వత విశ్రాంతి తీసుకున్నాడు ఆయన కథ- వ్యథ ముగిసింది

భారం అంబేడ్కర్‌పై పడింది

తాను దూరగంతలేదు మెడకో డోలు, అన్నట్లు ఆయనకో భార్య, ఇంకా సవతి తల్లి, ఆమె పిల్లలు కుటుంబానికి తానే పోషకుడిక దానికి తోడు విదేశాల్లో విద్యాభ్యాసం కావించాలనే కోరిక బలీయంగా ఉంది ఏది దారి ?

## అమెరికా వెళ్ళాడు—

అంబేడ్కర్ చదువు తెలివి వినయగుణానికి ముగ్ధుడై విదేశ విద్యకు కావల్సిన ధనసహాయం చేయడానికి అంగీకరించాడు బరోడా మహారాజు అందుకు బదులుగా తిరిగి వచ్చిన తర్వాత పదేండ్లు తమ సంస్థానంలో ఉద్యోగం చేయాలనే షరతు విధించాడు అంగీకరించాడు అంబేడ్కర్- అంతకు కఠిన నిబంధనకైనా ఒప్పుకునేందుకు సిద్ధంగా వున్నాడు, కారణం, విద్యార్జనపై ఆయనకున్న ఆసక్తి అలాంటిది

1913లో అమెరికా వెళ్ళి కొలంబియా విశ్వవిద్యాలయంలో చేరాడు ఎం ఎ విద్యార్థిగా నిరంతర పుస్తక పఠనం ఆయన దినచర్య పిడుగులు పడనీ అందుకు భంగం రానీయడు, విలాసాలపై ఆసక్తిలేదు విద్యార్జన ఆయన ఏకైక లక్ష్యం ఎన్ని మానసిక వ్యథలుంటే నేమి? తన ధ్యేయానికి భంగం కలుగనీయలేదు నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు।

"భారత దేశంలోని మతాలు వాటి పుట్టుపూర్వోత్తరాలు' అనే పరిశోధనాత్మక వ్యాసం వ్రాసి మేధావులనే ఆశ్చర్యపరచాడు అతని మేధస్సుకు దీక్షకు ప్రొఫెసర్లు కూడా గౌరవించేవారు "భారత దేశంలో వాణిజ్యం," అనే అంశంపై ప్రత్యేక వ్యాసం వ్రాసి 1916లో ఎం ఎ పట్టా పొందాడు

"భారత దేశ జాతీయాదాయం-చారిత్రక పరిశీలన' అనే విషయం మీద అదే యూనివర్సిటీలో పి హెచ్ డి పట్టాన్ని పొందాడు ఆ పుస్తకం విశేష ఖ్యాతికి కారణమయింది అప్పుడు డాక్టర్ అంబేడ్కర్ అయ్యాడు

## అమ్మచేతి వంట కమ్మదనం



అదే సందర్భంలో ఒక విశేషం జరిగింది ఒకనాడు లంచ్ సమయంలో యూనివర్సిటీ పార్కులో కూర్చుని తాను భద్రంగా దాచి తెచ్చుకొన్న టిఫిన్ తింటున్నాడు ఒంటరిగా కూర్చుని ఉన్న అంబేడ్కర్‌ను మిత్రులు చుట్టుముట్టారు

"మిస్టర్ అంబెడ్కర్ ఒంటిగా కూర్చుని ఏం చేస్తున్నావ్?" అని వచ్చి అతన్ని చూసి "అరే! లాడూలు తింటున్నావా? మాకు ఇవ్వవూ-' అని తీసుకొని తిన్నారు



"భలే రుచిగా ఉన్నాయే! ఎక్కడివివి?" అన్నారు సిగ్గుపడి పోయాడు అంబెడ్కర్ అన్నాడిలా బాధగా-



"ఇవి మా అమ్మ పంపినవి నేను అంటరాని కులం వాన్ని, మా అమ్మ అనాగరికురాలు చదువుకోలేదు, పేద స్త్రీ, ఆమె కొన్ని రోజుల వరకు ఎండు రొట్టెలు, ముక్కలు జమచేసి ఎట్లాగో శ్రమపడి సంపాదించిన బెల్లం, ఇంత నూనె వేసి దంచి ఉండలు చేసింది ఇవి అందంగా కనిపించాలని శనగ-వేరుశనగ

పప్పులు వేసింది-పైన తెల్లని వర్కుముక్కలూ చుట్టింది మా అమ్మ పంపిన ఈ పదార్థాన్ని మీ ముందు తినకపోవడానికి కారణం మేమెంతటి క్రింది స్థాయిలో ఉన్నామో అనే రహస్యం మీకు తెలియకుండా ఉండాలనే మీరు గొప్పిళ్ళవాళ్ళు. ఈ రోజు మీరు పట్టుపట్టే సరికి ఈ రహస్యాన్ని బయటపెట్ట వలసి వచ్చింది

వీటిని దైవ ప్రసాదం వలె నేను ఆప్యాయంగా తిన్నాను. మీరు విలువై పదార్థాలను కూడా నచ్చకపోతే విసరి పారేసే వాళ్ళు, మీది పై వర్గం, మీవి పె భవనాలు, మీరుపై సమాజం వాళ్ళు, నేను చిన్నయింటి మామూలు కుటుంబ సామాన్యుల వర్గం వాడిని." అంటూ కార్చాడు.

మిత్రులు తాము చేసిన పనికి నొచ్చుకొని మరేమీ అనక వెళ్ళిపోయారు. అమ్మ చేతివంట కమ్మదనం వారికెం తెల్సు. అందులో అనేకురి తల్లులకు పనులు చేసే అవసరం ఉండి ఉండదు ఆయాలు పిల్లలను పెంచుతారు. వంట మనుషు లుంటారు పనివాళ్ళ వంటల్లో రుచి ఉండొచ్చుకాని ప్రేమ ఉండదు కదా।

## లండన్ లోనూ చదివాడు-

అమెరికా చదువుతో సంతృప్తి చెందలేదు డా॥ అంబేద్కర్ ఆనాటి విజ్ఞాన కేంద్రం లండన్, జూన్ 1916లో ఆయన ఇంగ్లాండుకు పయనం కట్టాడు



బారిస్టర్ చదువుకోసం "గ్రీన్ ఇన్"లోనూ, ఎం ఎస్సీ. కోసం "హెరాల్డ్

లాస్కీ" విద్యాలయంలోనూ చేరాడు ఒకే సమయంలో అటు న్యాయశాస్త్రము, ఇటు విజ్ఞానశాస్త్రం చదవ నారంభించాడు

హెరాల్డ్‌లాస్కీలోని ప్రొఫెసర్లు డా॥ అంబేద్కర్ మేధస్సును పరీక్షించి కోర్సు పూర్తి చేయకముందే ఎం ఎస్సి, పట్టానిచ్చి డి ఎస్సి కోసం చదవ వల్సిందిగా సలహా నిచ్చారు

## స్వదేశానికి తిరుగు ప్రయాణం-

బరోడా రాజా డబ్బు పంపించే గడువు పూర్తయింది వచ్చి ఉద్యోగంలో చేరవల్సిందిగా కబురు పంపించాడాయన అంబేద్కర్‌కు ఆశాభంగమయింది

జీవధనములైన చెడుగాక పడుగాక
మాట తప్పలేదు మానధనులు॥

బారిస్టర్ చదువు, డాక్టర్ ఆఫ్ సైన్సు, రెంటినీ మధ్యలోనే ఆపి భారత దేశానికి తిరిగి వచ్చాడు అంబేద్కర్

## రామేశ్వరం వెళ్లివచ్చినా శనేశ్వరం తప్పలేదు

అమెరికా ఇంగ్లాండులలో చదివి ప్రముఖుల మేధావుల ప్రశంసలందిన డా॥ అంబేద్కర్ భారత దేశంలో అడుగుపెట్టగానే తిరిగి "మహార్ కులం" మహాపిశాచిలా వెంటబడింది ఎంత విద్యావంతుడు కానీ ఆయనతో ఇతర హిందూ ఉద్యోగులు కలిసిమెలిసి ఉండలేకపోయారు కనీసం ఉండడానికి ఇల్లుకూడా అద్దెకు లభించలేదు ఉద్యోగంలో చేరవల్సిందిగా శాసించగలిగినా తమ సంస్థానంలోని ఈ కుల జాఢ్యాన్ని అదుపు చేయలేకపోయాడు రాజా, మిన్నకొన్నాడు

అంబేద్కర్ తన పరిస్థితికి బోరున యేడ్చాడు రాజావారి మౌనం చూసి బొంబాయికి చేరుకొన్నాడు



## ఉద్యోగాలు – ఉద్యమాలు

సిడెన్ హోం కళాశాలలో 1918లో అర్థశాస్త్రం ప్రొఫెసర్‌గా నియమింపబడి విద్యార్థుల గౌరవాన్ని పొందాడు

1917లో మాంటెంగ్ ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణల పేర ఇండియాకు అదో రకమైన బ్రిటన్‌కు లోబడిన స్వయం పరిపాలన అధికారాన్ని ఇవ్వబోతున్నట్టు

ఆంగ్ల ప్రభుత్వం ప్రకటించింది. దాన్ని అతివాదులే కాదు మితవాద కాంగ్రెసు వాళ్ళూ వ్యతిరేకించారు

భారత స్వాతంత్ర్య పోరాటం తీవ్రస్థాయిలో ఉన్న ఆ కాలంలో బ్రిటన్ ప్రథమ ప్రపంచయుద్ధంలో తలమునకలై ఉంది అదే సమయంలో గాంధీజీ వైస్రాయి యుద్ధ కౌన్సిల్‌కు వెళ్ళి యుద్ధంలో వారికి భారత సహాయాన్ని బలపరచి రాజకీయాల్లో ప్రముఖుల్లో ఒకడుగా పేరు పొందుతున్నాడు

అప్పుడు కాంగ్రెసు- ముస్లింలీగ్ రెండే ప్రధాన పార్టీలు దళిత జనులైన అస్పృశ్యులకు సైతం ప్రభుత్వం సంప్రదింపుల్లో ప్రాతినిధ్యం కావాలని అంబేద్కర్ వాదించాడు

అంట్రాని నిమ్నజాతుల వాళ్ళు హిందూ సమాజంలో భాగమే కనుక వేరే ప్రాతినిధ్యం అవసరం లేదని గాంధీ తదితర కాంగ్రెసు నేతల అభిప్రాయం

అంబెద్కర్ అందుకు అంగీకరించలేదు

కులం పేయిపడగల విషసర్పమువలె (జాషువా కవి చక్రవర్తిఅన్నట్లు) భారత జాతుల్ని, ముఖ్యంగా తమవంటి దిగువ తరగతి వారిని ఎలా హింసిస్తున్నదో ఆయన ప్రత్యక్షంగా గమనించాడు. కులం కారణంగా పొందిన అవమానాలతో దెబ్బతిన్న నాగువలె ఆయనలో కోపం బుసలుకొడుతూ ఉంది

అదే కాలంలో బొంబాయి నుంచి "మూకనాయక్" అనే పత్రికను ప్రచురించసాగాడు

## నాగపూర్ నిమ్నజాతుల సభ—1920

అంటరానివాళ్ళు అనబడే కులాల వాళ్ళు ప్రత్యేకంగా ఒక సభ

జరుపుకోవటం భారతదేశంలో అదే మొదటిసారి అది డా॥ అంబేద్కర్ కృషి ఫలితం ఆ సభలో ఆయన ప్రసంగం ఇలా సాగింది

"అస్పృశ్యత అనేది వర్గకలహ సమస్య, తమలో తాము తాకదగిన వాళ్ళు (స్పృశ్యులు) గా ఇతరులను తాక తగిని వాళ్ళు (అస్పృశ్యులు)గా భావించే వాళ్ళు రెండు వర్గాలమధ్య ఘర్షణ పుట్టించేవాళ్ళు ఎవరైతే తమను పవిత్రులుగా మమ్మ అపవిత్రులుగా భావిస్తున్నారో, తమను ఉన్నతులుగా మమ్మ నీచులుగా భావిస్తున్నారో, వారి అభిప్రాయం ప్రకారం ఈ ఉచ్ఛనీచతల వ్యవస్థ సనాతన మైంది అంటే వారు ఎప్పుడూ పవిత్రులుగా ఉన్నతులుగానే ఉంటారు మేము ఎల్లప్పుడూ అపవిత్రులుగా అధములుగానే ఉండాలి హిందువులుగా ఉంటే మనం ఈ విషయంలో ఏ విధమైన మార్పునైనా తేగలమా? అసలే తేలేము—ఎప్పటికీ ఇంతే

మనం హిందువులుగా ఉన్నంతకాలం ఈ అన్యాయాన్ని ఎదిరించలేం అన్యాయాన్ని ఎదిరించడానికి బలం కావాలి మనుష్యబలం, ధనబలం, ఇంకా మనోబలం ఈ మూటిలో మనవద్ద ఏ ఒక్కబలమూలేదు హిందూమత నిర్మాణం వ్యవస్థపై ఆధారపడి ఉంది ఒక వ్యక్తితో మరో వ్యక్తి ఏ విధంగా వ్యవహరించాని అనేది హిందూ ధర్మంలో నియమితమైఉంది కానిఒకమనిషిమరో మనిషితో ఎలా మెదలకూడదో ఆ శిక్షణ దానిలో లేదు ఏ మతమైతే కొందరిని విద్వాంసులుగా ఉంచడాన్ని కొందరినివి ద్యా విహీనులుగా- అజ్ఞానులుగా ఉంచడాన్ని కోరుతుందో అది మతధర్మం కాదు, జనాన్ని మూఢులుగా ఉంచేందుకు పన్నిన కుట్ర -కుతంత్రం ఏ ధర్మం ఒకరి చేతికి ఆయుధాన్నిచ్చి ఇతరులను ఉత్త చేతులతో ఉంచుతుందో అది మతం కాదు ఒకరికి ఇతరులను బానిసలుగా ఉంచి చలాకీ తనము

ఏ మతమైతే కొందరికి ధన సంపాదన మార్గాలు తెరచి ఉంచి మరి కొందరిని ఇతరులపై ఆధారపడి బ్రతకమని బోధిస్తుందో అది మతం కాదు. పచ్చి స్వార్థం

ఏ మతంలోనైతే ఒక వర్గాన్ని కేవలం విద్య నేర్పడానికి, రెండవ వర్గాన్ని ఆయుధాలు ధరించడానికి, మూడవ వర్గాన్ని వ్యాపారం చేసుకోవడానికి, నాలుగవ వర్గాన్ని కేవలం పై మూడు వర్ణాల సేవ చేస్తూ జీవించమని శాసిస్తుందో ఆ మతం నాకు అంగీకారం కాదు



ఒక మనిషిని మరో మనిషి ముట్టుకోవటానికి అంగీకరించనంత

పతితులుగా భావించడం, ఈ హిందూ సమాజంలో తప్ప ప్రపంచంలో మరెచ్చటా లేదు

అంటరానితనం హిందూ సమాజానికొక మచ్చ, అని కొందరంటే అంటారుకాని, "హిందూ మతమే మనకు మచ్చ' అని ఏ ఒక్క హిందువుడూ అనడే వీరిలోంచి క్రైస్తవులుగానో, ముస్లిములుగానో మారిన వారిని, అంటరాని వాళ్ళు అలఅంటూ లేరు హిందువులు మనం హిందువులుగానే ఉన్నందుకు వీరు మనలను అంటరానివాళ్ళని అంటున్నారు అందుకే ఉచ్ఛనీతతలను పాటించని ముస్లింలు క్రైస్తవులు కూడా మనలను తక్కువస్థాయిగా చూస్తున్నారు, ఈ దాస్యాన్ని పోజేసుకోవాలంటే మతం మార్పిడికంటే వేరే దారిలేదు

హిందూ ధర్మం నాకు నచ్చుతూలేదు మానవులు మతం కోసం కాదు మతమే మానవుల కోసం, ఏ మతం మన మానవత్వానికి ఏ మాత్రం విలువిస్తూ లేకో ఆ మతంలో మనం ఎందుకుండాలి? ఏ మతం మనల మంచినీరు కూడా తాగ నీయదో ఆ మతాన్ని అంటిపెట్టుకొని మనం ఎందుకుండాలి? ఏ ధర్మం మనల విద్యనేర్చుకోవడాన్ని వ్యతిరేకిందుతుందో ఆ ధర్మంలో మనమెందుకుండాలి? ఏ మతం మనకు ఉద్యోగాలు కూడా దొరుకకుండా అడ్డునిలుస్తున్నదో, ఇంకా మాట మాటకు అవమానాలకు గురిచేస్తున్నదో ఆ మతంలో మనం ఎందుకుండాలి?-'

ఇదీ అంబేడ్కర్ గంభీరవాణి, మేఘ గర్జన

## దళిత ఉన్నతి కోసం -

ఒక్క హరిజనుల విషయంలోనే కాదు, సాంఘిక అసమానతలకు అవమానాలకు గురిఅయ్యే ప్రతి జాతిపైనా అతనికి అపారమైన సానుభూతి ఉంది శూద్రుల గురించి ఆయన పలికిన హక్కులు వినండి

"శూద్రులు అన్నిటికంటే క్రింది వర్ణం, వారిపై ఇన్ని నిబంధనలు ఉంచారు కదా ఇకవారు ఎన్నిటికీ పైకి రాలేరు ఇంతవరకు ప్రజలు శూద్రుల విషయంలో సరిగా ఆలోచించడమే మరచి పోతున్నారు హిందూ సమాజంలో శూద్రుల సంఖ్య అస్పృశ్యులను కలుపుకోకుండానే 75-80 శాతం ఉంది ఇంత పెద్ద సంఖ్యను వేరుగా ఉంచితే సమాజం ఉన్నతి ఎలా సాధ్యమవుతుంది? భారత దేశం యొక్క వికాసం నాలుగు వర్ణాల అభివృద్ధిపై ఆధారపడి ఉంటుంది'

అందుకు ఇలా కృత నిశ్చయుడైనాడు

"ఇది నా ప్రతిజ్ఞ, నేను జన్మించి నటువంటి దళితజాతి సేవలోనే నా జీవితాన్ని బలిదానం చేస్తాను ఏ జనంలో పెరిగి పెద్దవాణ్ణి అయ్యానో ఏ జనంలో నేనొక్కడనో ఆ జనం కోసం శ్రమిస్తాను నేను నా కర్తవ్య నిర్వహణలో ఒక్క అంగుళం కూడా ప్రక్కకు జరుగను నా విరోధుల విపరీత ఆలోచనలకు చింతిస్తున్నాను"

నేరమంతా అగ్రవర్ణులపై వేయలేదు బాధపొందేవాడు తన కష్టాన్ని దాస్యాన్ని నీచతను తొలగించుకోవడానికి ప్రయత్నించాలి-పోరాడాలి, అని ఇలా హెచ్చరించాడు

"దోషం పై వర్ణాల వారిదే కాదు, ఈ నరక జీవితాన్ని అనుభవిస్తూ పైకి లేవని మనది కూడా, మురుగు కాలువలోని క్రిములవలె పడిఉంటూ ఆ మురుగుతోనే సంతోష పడుతున్నారు మనవాళ్ళు, ఈ దుస్థితిని ద్వేషిస్తూలేరు"

అందుకు కారణాలు సైతం ఇలా ఆలోచిస్తాడు

"అవిద్య, అజ్ఞానం, దారిద్ర్యం ఈ మూడు దయ్యాలు మన మనస్సుల్ని మీద అధికారం చలాయిస్తున్నాయి వాటిని అంతం చేయటం అవసరం, సరియైన శిక్షణ వల్లనే అది సాధ్యం-"

అంటరాని వాళ్ళ పక్షం నిలుస్తూ-వాదిస్తూ కాంగ్రెసు వారితో తరచు విభేదించడం చూసి అంబేద్కర్‌ను దేశభక్తి లేని వ్యక్తిగా చిత్రీకరించారు కొందరు దానికి అంబేద్కర్ ఇలా జవాబిచ్చాడు

"ఉన్నతులమని భావించే హిందువులతో నాకు కొన్ని విషయాల్లో విభేదముందనే విషయాన్ని నేను ఒప్పుకొంటాను కాని, దేశ రక్షణ-విముక్తికోసం నా ప్రాణాన్ని సైతం బలి ఇస్తానని మీముందు నేను ప్రతిజ్ఞ చేస్తున్నాను"

ఇక ఎవ్వరు ఆ మహనీయుని శీలాన్ని శంకించగలిగేవారు మాటకు క్రియ సాక్షి ఆ మరణం ఆయన చేసిన పనులు పరిశీలిస్తే ఆయన ఎంతటి సత్యసంధుడో సమాజశ్రేయస్సును కాంక్షించే వాడో స్పష్టంగా తెలిసిపోతుంది

స్వాతంత్ర్య పోరాట విషయంలో అంబేద్కర్ ప్రవచనం ఇలాగుంది

"బ్రిటిష్ ప్రభుత్వం కొన్ని మంచి ఉద్దేశ్యాలతో ఉన్నప్పటికీ, మన కష్టాలను తొలగించడంలో అది విఫలమైంది రాజకీయ శక్తి (పరిపాలన) ఎంత వరకు మన చేతుల్లోకి రాదో అంతవరకు మనంకానీ మరెవరు కానీ, మన కష్టాలను అంతం చేయడం సాధ్యంకాదు. రాజకీయాల్లో మన భాగస్వామ్యం విషయంలోను బ్రిటిష్ ప్రభుత్వం ఇక్కడ ఉన్నంతవరకూ లేదు కేవలం స్వతంత్ర ప్రభుత్వంలోనే పాలనాధికారాన్ని మనచేతుల్లోకి తీసుకోగల్గుతాము అలాకాక జనానికి శుభం జరుగదు "

అదీ ఆయన ఆకాంక్ష, అందుకే ఆయన ఉత్తుంగ స్వార్థభావ తరంగాలతో ప్రతిఘటించే హిందూ జన సముద్రంతో తలపడ్డాడు ఆంగ్ల ప్రభుత్వం అనే తుఫానులో ప్రయాణం హరిజన నావకు బలం చిన్నది అయినా ధర్మం తెరచాప తాను చుక్కాని

అంబేద్కర్ పోరాటం కారణంగానే కాంగ్రెసు దృష్టి ఇటువైపు మళ్ళింది హరిజన సేవకు పూనుకొన్నారు

## విదేశీ విద్య పూర్తి చేశాడు -

1920లో తిరిగి లండన్ వెళ్ళినాడు మధ్యలో నిలిపి వచ్చిన డి ఎస్సి మరియు బారిస్టర్ చదువులు పూర్తి చేశాడు అపారమైన మేధస్సుతో కార్య దీక్షతో 1923లో భారతదేశం తిరిగి వచ్చాడు ఆ కాలంలో ఇంతటి విద్య సాధించినవారు ఆ జాతిలో-ఏ జాతిలోనూ యావద్భారతదేశంలో వేరొకరు లేరంటే అతిశయోక్తి కాదు

అతడు బి ఏ ప్యాసైన తరువాత 7-8 ఏండ్లవరకు ఏ ఒక్క మహర్ విద్యార్థికానీ ఆ పట్టం పొందలేదంటే ఆ కాలంలోని అంటరానివారి స్థితిగతిని గమనించవచ్చు

## బారిస్టరుగా డా॥ అంబేద్కర్-

బొంబాయిలో బారిస్టర్‌గా నూతన జీవితాన్ని ఆరంభించాడు సంపాదన పెరిగింది అదంతా తన ధ్యేయ సాధనకు అస్పృశ్యుల సముద్ధరణకు వెచ్చించసాగాడు

దిక్కులేని దీనులకు దిక్కయి ఉచితంగా వాదిస్తూ పేదల (వకీలుగా) పెన్నిధిగా పేరుపొందాడు

1924లో "బహిష్కృత హితకారిణీ సభ'ను స్థాపించాడు అది తన ప్రజాసేవకు కార్యరంగమైంది



## రాజకీయాల్లో ప్రవేశం –

అదే కాలంలో బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ మెంబర్‌గా ఎన్నికయ్యాడు ప్రజాదరణ పెరిగింది ఎక్కడికి వెళ్ళినా ఏ పదవి చేపట్టినా తన ధ్యేయంలో మార్పులేదు ఎవ్వరు విభేదించినా తన బాట వదలడు దళిత దీన ఉన్నతి అతని ధ్యేయం హిందువులను వాయ మించిపోవాలని కాదు వారితో సమానస్థాయిలో ఉండాలనేదే ఆయన ప్రగాఢ వాంఛ

అదేకాలంలో ఏకైక కుమారుడు అనారోగ్యంతో మృతి చెందడముతో భార్య అనారోగ్య పడింది ఇలా కుటుంబ సమస్యలు మనస్సును కల్లోల పర చినా అంబేడ్కర్ తన కర్తవ్యాన్ని మరచిపోలేదు

1928లో సైమన్ కమీషన్ భారతదేశానికి వచ్చింది బొంబాయిలో డాంగే, మద్రాసులో టంగుటూరు ప్రకాశం పంతులు, లక్నోలో నెహ్రూ, లాహోరులో లాలాలజపతిరాయ్ ఆ కమీషన్‌కు వ్యతిరేక ప్రదర్శనలు జరిపారు

భారతదేశానికి స్వయం పరిపాలన ఇవ్వవచ్చునో లేదో అనేది దేశంలో తిరిగి ప్రజాభిప్రాయాన్ని దేశస్థితిని గమనించి నిర్ణయించడం ఆ కమీషన్ ఉద్దేశ్యం అదో అనవసర కాలయాపన-బ్రిటిష్ ప్రభుత్వ పన్నాగం

ఆ కమీషన్‌ను ఏర్పరచినందుకు కాదు. అందులో కాంగ్రెసు సభ్యులను తీసుకోనందుకు గాంధీజీ కూడా దాన్ని వ్యతిరేకించాడు

ఆ సందర్భంలో అంబేడ్కర్ తమ మైనారిటీ ప్రజల సమస్యల గూర్చి కమీషన్‌కు ఒక వినతి పత్రం సమర్పించుకొన్నాడు ఆయన ధ్యేయం వేరు

స్వతంత్రం రావాలి కాని, తమ జాతివారి స్థితిగతిలో మార్పు కావాలి. అనేది అతని కోరిక

## మొదటి సత్యాగ్రహం -

మహారాష్ట్రలోని మహాద్ గ్రామంలో ఉన్నది ఒకే చెరువు దాని నీరే గ్రామస్థులందరికీ అన్న పానీయాలకు ఆధారం.

అక్కడి హిందువులు అస్పృశ్యులను చెరువు నీరు తాకనీయలేదు వీరికి వేరే నీటి సౌకర్యం లేదు నీరే ప్రాణాధారం కదా అది గ్రామపెద్దల గుప్పిట్లో బంధించబడి ఉంది వారి వశంలో లేదు కాని ఉంటే గాలిని బంధించే వారే కాబోలు.

హరిజనుల సేవ కావాలి తమకు. కాని, వారు కష్టపడుతూనే ఉండాలి వారిని దూరంగా అంటరానివాళ్ళుగా నిందిస్తూ తమ గొప్ప చాటుకొనే అల్పబుద్ధికి దాసులు, ఎందరు సంస్కర్తలు (బసవన, రామానుజుడు, వేమన, బ్రహ్మం వంటి వారు) వచ్చినా మన హిందువుల బుద్ధిలో మార్పురాలేదు ఇప్పుడు హరిజనుల్లో కన్పిస్తున్న మెరుగుదలకు అంబేద్కర్ కృషి ఎంతగానో ఉంది



అప్పుడు "మహాద్' విషయం తెల్సి అంబేద్కర్ అక్కడికి వెళ్ళి గ్రామస్థులను అభ్యర్థించాడు-వాదించాడు వారు వినకపోవటంతో ఈయన సత్యాగ్రహం ఆరంభించాడు చివరికి గ్రామపెద్దలు రాజీకి రాక తప్పలేదు జాతిభేదం జోలి లేకుండా అందరికీ చెరువునీరు తీసుకొనే సౌకర్యం లభించింది.

ఇది అంబేద్కర్ మొదటి సామాజిక విజయం

## గాంధీతో సమావేశం -

మొదటి రౌండుటేబిల్ సమావేశానికి 12 నవంబర్ (1930) అస్పృశ్యుల సమస్యపై చర్చించడానికి అంబేద్కర్ లండన్ వెళ్ళివచ్చాడు కాంగ్రెసు వాళ్ళు ఎవరూ ఆ సమావేశానికి వెళ్ళలేదు

16 ఆగస్టు 1931 నాటి. రెండవ రౌండ్ టేబిల్ సమావేశానికి వెళ్ళాలని అంబేద్కర్ నిశ్చయించుకొన్నాడు దానికి ముందుగా 6 ఆగస్టు 1931 నాడు గాంధీజీ కోరికగా ఆయనను కల్సుకొన్నాడు డా॥ అంబేద్కర్

గాంధీజీ ఇలా అన్నాడు-

"మీకు నాపై కాంగ్రెసుపై కొన్ని ఆరోపణలు ఉన్నాయని విన్నాను. కాంగ్రెసు అస్పృశ్యుల ఉన్నతికోసం 24 లక్షల రూపాయలు ఖర్చు చేసింది. మీరు నన్ను కాంగ్రెసును వ్యతిరేకించడం విచిత్రమైన విషయం"

అందుకు అంబేద్కర్ జవాబు ఇలాగుంది-

"కాంగ్రెసు అంటరానివారి ఉద్ధరణకు ఖర్చు పెట్టిందంటే అది డొంక తిరుగుడు మాట-అసత్యం తప్ప మరేమీ కాదు ఇది నిశ్చయం 24 లక్షల ఖర్చయినాయంటే అటో ఇటో ఎగిరిపోవచ్చు

కాంగ్రెసు సభ్యులకు ఖాదీ ధరించడం తప్పని సరి నియమం చేసినట్లు, అస్పృశ్యతను పాటించక పోవటం కూడా ఒక తప్పనిసరి నిబంధనగా ఎందుకు ఏర్పరచలేదు కాంగ్రెసు ఇలా చేసి ఉంటే, నాసిక్ జిల్లా కాంగ్రెసు అధ్యక్షుల నాసిక్ రామమందిర ప్రవేశానికి అంటరాని వారిని అడ్డుకొనేవారా? మీ కాంగ్రెస

వారికి ఆంగ్ల ప్రభుత్వం యొక్క హృదయం మార్పును చూడాలని ఉంది అంతకు ముందుగా మా విషయంలో తమ హృదయాలను ఎందుకు మార్చుకోరు? ఇప్పుడు మాకు మీపై కాని, మీ కాంగ్రెసుపై కానీ విశ్వాసం లేదు ఏ మాటపై నైనా మాకు నమ్మిక ఉంటుందంటే అది మా సముద్ధరణకు నిజమైన కృషి చేయగలిగి నప్పుడు మాత్రమే-"

గాంధీ మరేమీ మాట్లాడలేదు ఆయన వద్దన్నా ఈయన రెండవ రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్‌కు వెళ్ళాడు

అంతకు ముందు-

# అలహాబాద్ సన్మానం - ప్రసంగం -

1928లోని మహాద్ సంఘటన, 1930లోని నాసిక్ దేవాలయ ప్రవేశ సత్యాగ్రహంతో డా॥ అంబేద్కర్ పేరు దేశంలోని మారు మూల ప్రాంతాలకు కూడా వ్యాపించింది

ఆయన ఆరుకోట్ల హరిజనుల నేత అయ్యాడు ఎక్కడికి వెళ్ళినా అసంఖ్యాక జనం సమావేశమయి ఆ నాయకుని గౌరవించేవారు

27 జూన్‌లో అంబేద్కర్ అలహాబాద్ వెళ్ళాడు, గాంధీ సబర్మతీ ఆశ్రమం దాని సమీపంలోనే ఉంది, అంటరానివాళ్ళేకాక ఇతర హిందువులూ పెద్ద సంఖ్యలో చేరి ఆయనను ఘనంగా ఎదుర్కొన్నారు స్థానిక "నవయువక మండలి" వారు సన్మాన పత్రం సమర్పించారు "శ్రీమాన్ డాక్టర్ అంబేద్కర్ ఎం ఎ , పి హెచ్ డి , డి ఎస్సి , బారిస్టర్ ఎట్ లా , ఎం ఎల్.సి ।' అని సంబో ధించిన ఆ పత్రంలో ఆ నాయకుని శ్రమశీలతకు, సమతాభావనకు, త్యాగ గుణానికి ఒక రుషిగా అభివర్ణించారు ఆయన కృషి మూలంగానే దళితులు తమ

పరాధీన మనస్తత్వాన్ని వీడి స్వయంగా ఆలోచించడం, స్వేచ్ఛగా గౌరవంగా జీవించాలనుకోవడం, నేర్చుకొన్నారని అన్నారు ఇంకా-

"మనం మన అధికారులతో ధృఢంగా పోరాడవల్సి ఉంది వారు మనతో అందరు సమానులనే అంటారు సోదరుల మన్నట్లుగా మాట్లాడుతారు కాని, ఆ మాటల్లో ఉన్నత వర్గపు వాసనే వస్తుంది అది ఎక్కడ, ఆ సమానత్వ మెక్కడ? ఈ సంస్కార కాలంలోనూ మా నీడను వాళ్ళపై పడనీయరు ఒక వేళ పూర్వకాలపు హిందువులు మాతో అలా మెదలితే వాళ్ళు పుస్తకాల ఛాందస పురుగులని వదిలేయొచ్చు కాని విచారించదగిన విషయం ఏమంటే పాశ్చాత్య దేశాల్లో విద్యలు నేర్చిన, ఈ 20వ శతాబ్ది నాగరిక హిందువులే అలా మెదలటం ఇప్పుడు భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వం ఉన్నప్పుడే ఇలా మెదలుతున్నారంటే, ఆశిస్తున్న స్వరాజ్యమే లభిస్తే మమ్మల్ని ఏం చెయ్యలేరు? అనేది మా అనుమానం

ఈ పరిస్థితులనన్నిటిని గమనించి మనం హిందువులతో వేరుగా ఉంటూనే అధికారం కోసం పోరాడాలి మాకీ కార్యనిర్వహణలో మీ వాస్తవిక సహాయం లభిస్తుందని ఆశిస్తున్నాం మొదటి రౌండ్ టేబిల్ సమావేశంలో మీరు మా తరపున ఏ మంచి పని చేశారో దానికి మీకు శతకోటి ధన్యవాదాలు, రాబోవు రౌండ్‌టేబిల్ సమావేశంలోనూ అలాంటి సేవనే చేయాలి మా గొంతును గట్టిగా వినిపించాలి

మేము మీ స్వచ్ఛమైన
కృతజ్ఞులమైన అనుయాయులము,
అహ్మదాబాద్ అస్పృశ్యులు,"

దీనితో కాంగ్రెసుపైన నాటి అంటరాని జాతులవారికి ఎలాంటి అనుమానం ఉంది, తమ నాయకుడైన డా॥ అంబేద్కర్‌పై ఎంతటి విశ్వాసం ఉంది తెలిసి పోయింది కదా

ఆ సభా నిర్వాహకులకు, సభికులకు ఆనాడు అంబేద్కర్ ఇచ్చిన జవాబు మరచిపోరానిది

"సోదరులారా-సోదరీమణులారా,

మీరు నాకు సన్మాన పత్రం ఇచ్చారు అందుకు నవయువక మండలి, దరియాపూర్ వీధి వారికి కృతజ్ఞుడను సన్మాన పత్రంలోని మీ స్తుతికి నేను అర్హుడను కాను నాతో అయినంతవరకు జాతి ఉన్నతి కోసం ప్రయత్నిస్తానని మీకు హామీ ఇస్తున్నాను అహ్మదాబాద్ నగరం సమస్త భారత రాజకీయ విషయాలకు కేంద్ర స్థానమయింది మునుపు ఇక్కడ వ్యాపారపు ముచ్చట్లే నడిచేవి కాని గాంధీగారు వచ్చింతర్వాత రాజకీయపు మాటలు మొదలైనవి నాకంటే మీకే ఇక్కడి రాజకీయాలు ఎక్కువగా తెల్సు ఖద్దరు దుస్తులు వేసు కొన్న వాళ్ళు ఇది చక్కగా తెల్సుకొని ఉంటారు నాకు తెల్సు ఈ ఖాదీధారులకు గాంధీజీ అంగీకరించే స్వరాజ్యం గురించి ఏమీ తెలియదు

సత్యం, ఏమిటి అనే విషయం వారికి తెల్సా? సత్యమైన ఆగ్రహంపై కూర్చుంటే నిజంగా విజయం పొందుతారు గాంధీజీ ఎదుట బలమైన బ్రిటిష్ ప్రభుత్వమే తలవంచింది మీరు ఖద్దరు ధరించిన వాళ్ళందరూ గాంధీజీ రాజనీతిని ఒప్పే వాళ్ళయితే నేను మిమ్మల్నో ప్రశ్న అడుగుతాను మీరు మా ఉద్ధరణ కోసం ఏం చేశారు? సత్యాగ్రహం చేసి పారతంత్ర్యాన్ని దూరం చేయాలని అంటారు కాని మీరు మంచినీటి బావులకోసం, అస్పృశ్యతా నివారణ కోసం, మాకేం చేశారు? చాలమంది అంటరాని జాతి సోదరులు నాపై కోపగించుకోవచ్చు

కాని దానికి, బెదరను దేశం కోసం ఏమైనా చేయాలని మీరంటారు అయితే, నేను మిమ్మో ప్రశ్న అడుగుతున్నాను ఈ దేశం మీదేనా? దానికి ఏం ప్రమాణ ముందో చూపండి మిమ్ములను మనుష్యులుగానే లెక్కించరు మీ భూముల గూర్చి కూడా మంది ఈర్ష్యచెందుతుంటారు మీరు నడవటానికి మార్గం కూడా విడవరు ఇలాంటి మనిషి ఎలా ఈ దేశం తనదని చెప్పగలుగుతాడు?

బ్రాహ్మలు, వైశ్యులు, పఠాన్లు బాగానే అంటారు కాని ఎవరి నీడను చూడడానికి సైతం ఒప్పుకోరో, వారిదే ఈ దేశమని ఏ ఆధారంతో అంటారు? దానికి విరుద్ధంగా మీరుకూడా ఈ దేశం మనదని, దానికోసం కళ్ళు మూసుకొని మరణించడానికి సిద్ధపడి ఉంటే, మీ ఆలోచనల ప్రకారం నేను మిమ్ము సాధు సత్పురుషులనుకొంటాను గాంధీగారు హిందూ-ముస్లిములు, సిక్కులు గురించిన చర్చలే చేస్తున్నారు గాంధీజీ మొదట అంటుండేవారు దేశజనంలో సమైక్యత ఏర్పడేవరకు రౌండ్ టేబిల్ సమావేశానికి వెళ్ళనని, కాని, కాంగ్రెసు ఏమిటీ వారిని పంపిస్తున్నది నేను వారికంటె ముందు రౌ టే స కి వెళ్ళాను ఎందుకు? స్పృశ్యాస్పృశ్యుల ఉన్నతికోసం

ఈ సమావేశంలో పాల్గొనడంతో అస్పృశ్యులకు లాభం కలుగుతుందని నా విశ్వాసం అందుకే నా దగ్గరున్న కేసులన్నింటిని వదలి నేను ముందే వెళ్ళాను

గాంధీజీ అంటరానివారిని గురించి ఏదీ స్పష్టంగా ఎందుకు ప్రకటించరు? ఏ వ్యక్తితో లేదా సమాజంతో ఉంటామో వారితో అన్ని విషయాలు ముందే ఒప్పందం కావించుకోవాలి కరాచిలో గాంధీజీ చెప్పింది ప్రచురించబడింది దానిపై వారికి విశ్వాసముంది దాని కార్యభారం ఎవరిపై ఉందని నేను ప్రశ్నిస్తున్నాను. ఒకవేళ భారం మనపై ఉంటే నేను స్వీకరిస్తాను. కాని ఎవరైతే మనతో ఉండు

మట్టు పాటిస్తున్నారో వారు ఆ విషయంలో 72 కాలంలో వ్రాసింది అమలు పరచకుంటే దండించడం ఎవరి చేతుల్లో ఉంది స్వరాజ్యం వచ్చి ఆంగ్లేయ ప్రభుత్వం ఇక్కడినుంచి వెళ్ళిపోతే 22 కాలం కేవలం పుస్తకాల్లోనే పడి ఉంటుంది ఏ హిందువులైతే ధర్మశాస్త్రాన్నే అవహేళన చేశారో వారికి 22 మాటల అవహేళన చేయటానికి ఎంతసేపు పడుతుంది

రౌ టే స లో నేనే దేశహితంలో అందరికంటె ఎక్కువగా పనిచేశాను దేశంకోసం ఎంతగానైతే నేను పోరాడానో అంతగా మరెవరూ ఎదిరించలేదు ఆంగ్లేయ ప్రభుత్వానికి నేనెలాంటి టీకాలు వేశానో అలాగా బహుశః ఏ హిందువూ ఇచ్చి ఉండదు

మీరనుమతిస్తే నేనో మాట చెప్తాను నా అంతటి స్వాతంత్ర్య కాంక్షులు ఇతరులెవరూలేరు శీఘ్రంగా మనదేశానికి స్వతంత్రం రావాలని కోరుతున్నాను అయితే ముందుగా నేను జాతి ఉన్నతిని కోరుకొంటున్నాను మానవుని జీవితం పెద్దదిగా ఉంటుంది ఈ మొత్తం కాలంలో నేను ఇతర విషయాల జోలికి పోకుండా జాతి శ్రేయస్సును అన్నిటికంటె ఎక్కువగా కోరుతాను

అంబాలాల్, తారాబాయ్, మొ॥ మిల్లుల యజమానులు కాంగ్రెసును బలపరచేది కేవలం మాంచెస్టర్ మిల్లు సామగ్రి (వస్త్రాలు) ఇక్కడికి రావద్దని, తమ మిల్లుల బట్టలే అమ్మబడాలని, స్వార్థం మనిషిని ఎక్కడికక్కడే లాక్కు వెళ్తుంది నాకు కూడా నా జాతి త్వరగా ఉన్నతి పొందాలనే స్వార్థం అన్నిటికీ మొదటిది '

ఇలా పలు ప్రాంతాల్లో పర్యటిస్తూ ఘన గౌరవాన్ని పొందుతూ తన ప్రసంగాలను దృఢ సంకల్పంతో వివరించాడు

# గాంధీతో అంబేద్కర్ వాదం –

రెండవ రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్‌కు గాంధీ-అంబేద్కర్ ఇద్దరూ వెళ్ళారు ఎవరి పట్టుదల వారిది స్వరాజ్యం కావాలనే కాంగ్రెసు కోరికను ఆయన వినిపిస్తే. అస్పృశ్యుల సమస్య-స్థానం ఏమిటనే విషయం ఈయన ప్రశ్నించాడు.

తిరిగి వచ్చిన తర్వాత గాంధీ అంబేద్కర్‌ల మధ్య సంభాషణ ఇలా నడిచింది-



గాంధీజీ—

రౌండ్ టేబిల్ పరిషత్తులో మీరు నిర్వహించిన కార్యం రిపోర్టు ద్వారా మీరొక గొప్ప దేశభక్తులని నేను తెల్సుకొన్నాను

అంబేడ్కర్-

ఒక మనిషి దేశభక్తుడు కావటానికి ముందుగా ఆ దేశం తనదని అనుకో గలగడం అవసరం ఏ దేశంలోని ప్రజాస్థానాల్లో నన్ను నీరుకూడా తాగనివ్వరో ఆ దేశాన్ని నాదని ఎలా చెప్పుకోగలను అయినప్పటికి నేను నా దేశ సంక్షేమానికి విరుద్ధంగా ఏ పనీ చేయకనే, అస్పృశ్యుల కోసం నాతో అయినంత వరకు ఇప్పటికీ చేస్తాను అందరికీ తెల్సు అంటరానివాళ్ళు, ముస్లింలు, సిక్ఖులు మొ॥ వారందరి కంటే చాల వెనుక ఉంచబడ్డారని, మొదటి రౌండ్ టేబిల్ సమావేశంలో అస్పృశ్యులకు ముస్లింలకు వలె వేరే ప్రతినిధిత్వం ఇవ్వాలని నిర్ణయం తీసుకోబడింది కాంగ్రెసు, ముసల్మానుల అభ్యర్థనలను స్వీకరిస్తుంది మరి అది మా కోర్కెలను కూడా అంగీకరిస్తుందా?

గాంధీజీ—

హిందువులతో వేరుగా మీకు రాజకీయ అధికారం ఇవ్వడానికి నేను వ్యతిరేకిస్తాను అది హిందువుల మనస్సులకు నొప్పి కలిగించే విషయం-

అంబేడ్కర్—

మీరు మా అభిప్రాయాన్ని స్పష్టంగా తెల్పినందుకు మీకు నా కృతజ్ఞతలు మన యిద్దరి మనస్సులు తెలిసిపోయినై ఇక నేను మీతో సెలవు తీసుకుంటాను—

## గాంధీజీ హరిజన సేవపై అంబేడ్కర్ పుస్తకం—

24 ఆగస్టు 1931న గాంధీజీ లండన్ వెళ్ళాడు. మదన్ మోహన్ మాలవ్యా, సరోజినీదేవి నాయుడు కూడా ఆయన వెంట ఉన్నారు లండన్‌లో ప్రసంగిస్తూ గాంధీ ఇలా అన్నాడు

"అస్పృశ్యుల కోసం పనిచేసే భారాన్ని ఆరంభం నుంచీ కాంగ్రెసు తన భుజాలపై వేసుకొంది 1930లో వారికోసం కాంగ్రెసు చాల పెద్ద ముందడుగు వేసింది అంటరానితనాన్ని పారద్రోలటం కూడా తన రాజనీతి కార్యక్రమాల్లోనే చేర్చుకొంది

"కాంగ్రెసు మరియు గాంధీ అంటరాని వాళ్ళకోసం ఏం చేశారు? అనే పుస్తకాన్ని అంబేద్కర్ వ్రాసింది ఈ సందర్భంలోనే

"కాంగ్రెసు శవ పరీక్ష' అనే పుస్తకం యశపాల్ వ్రాసిన విషయం మీకు తెలుసుననుకుంటాను

1942-46 లోనైరే గాంధీజీ భక్తితత్వాన్ని రాజకీయాల్లో మేళవించ డాన్ని కాంగ్రెసు నేతలే వ్యతిరేకించినట్లు డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య గారు రచించిన "కాంగ్రెసు చరిత్ర 2వ భాగం-లో స్పష్టంగా ఉంది

గాంధీజీ చిత్తశుద్ధిని శంకించేవారు లేరు, కాని ఆయన సిద్ధాంతాలు అనే కులికి అంగీకారం కాలేదు

డా॥ అంబేడ్కర్ దేశభక్తి అచంచలమైంది కాని, ఆయన దళితజన ఉన్నతికోసం కృషిచేయడం ప్రధాన లక్ష్యంగా ఎంచుకున్నాడు ఆయన తను సైగతో ఆరుకోట్ల జనం అగ్నిలో దూకడానికైనా సిద్ధంగా ఉన్నా, దేశంలో కల్లోలం సృష్టించలేదు- స్వాతంత్ర్య సాధనకు అడ్డంకి కాలేదు అది ఆయన ఉత్కృష్ట మనస్తత్వానికి దేశభక్తికి నిదర్శనం శాంతిగా ఆందోళనలు నిర్వ హిస్తూనే తన కోరికలు సాధించుకోజూశాడు గాంధీజీ శాంతి సత్యాగ్రహాల్లోనైనా అనేక పర్యాయాలు హింస చోటు చేసుకుంది కాని అంబేద్కర్ ఉద్యమాల్లో ఎనాడూ హింసాపూరిత కల్లోలం చెలరేగలేదు ఆయన తన నిర్ణయాల విషయం

లోనూ ఏనాడూ ఊగిసలాడలేదు ఒకే ధ్యేయంపై స్థిరంగా ఉన్నాడు-సాధించాడు కూడా చాలవరకు సత్యమేవజయతే। అని కదా భరతసూక్తి

# రాళ్ళు విసరిన వారిని పూలతో ఎవరు పూజిస్తారు ?

రెండవ రౌండ్ టేబిల్ సమావేశానికి వెళ్ళి తిరిగి భారతదేశం వచ్చిన సమయంలో గాంధీజీకి బొంబాయిలో అస్పృశ్యులు నల్లజండాలతో నిరసన తెలిపారు.

5 డిసెంబర్ 1931న డా॥ అంబేడ్కర్ లండన్ నుంచి అమెరికా వెళ్ళి, 19 జనవరి 1932 నాడు ఇండియాకు చేరుకున్నాడు బొంబాయిలో ఆయనకు ఘనమైన స్వాగతం లభించింది

అస్పృశ్యులకు ఆత్మబంధవులెవరో తెల్సిపోయింది

శతాబ్దాలుగా స్తబ్దంగా అవమానాలను భరిస్తూ పడి ఉన్నట్లుగా, ఉండ దానికి వారిప్పుడు సుముఖంగా లేరు తమ రాగద్వేషాలను ప్రకటించడానికి సిద్ధంగా ఉన్నారు

వారికంతటి ధైర్యం-వివేకం ప్రసాదించింది వారి ప్రియతమ నాయకుడు డా॥ అంబేడ్కర్

# ఘన విజయం—

26 మే 32కు అంబేడ్కర్ మళ్ళీ లండన్ వెళ్ళాడు అస్పృశ్యుల సమస్యపై ప్రభుత్వంపై ఒత్తిడి చేయడానికే ఆ ప్రయాణం ఆయన శ్రమ ఫలించింది

17 ఆగస్టు 32 నాడు తిరిగి ఇండియాకు చేరాడు.

20 ఆగస్టు 32న బ్రిటిష్ ప్రధాని బహిరంగ ప్రకటన వెలువడింది అందులో హరిజనులకు ప్రత్యేక ప్రాతినిధ్యం లభించింది ఎన్నికల్లో నిలబడే హక్కు- అధికారం ఇవ్వబడింది

ఇది అంబేడ్కర్‌కు ఘన విజయం అస్పృశ్యులకు గొప్ప మార్పు

తరతరాల అంతరాల తిరగలిలో నలిగి నలిగి
నిరంతరం దారిద్ర్యపు బానిసలై కలగి కలగి
కులమతాల పక్షపాత ఉచ్చుల్లో బిర్ర బిగిసి
కుటిల రాజకీయ ఘురా రొచ్చుల్లో అణగి మునిగి,

ఉన్నవారికి బంధవిముక్తి - క్రొత్త కాంతి

అదైనా ఎందుకు? ఇతర హిందువులతో సమాన స్థాయికి చేరుకోవడానికి, ఆత్మ గౌరవంకోసం తోటి సోదరుల అభ్యున్నతి కోసం డా॥ అంబేడ్కర్ గట్టి పట్టుదల పూని ఫలితం సాధించాడు.

## గాంధీజీ ఉపవాస వ్రతం—

బ్రిటిష్ ప్రధాని హరిజనులకు ఇచ్చిన అధికారాలను వాపసుతీసుకునేంత వరకు నిరాహార వ్రతం ఆరంభిస్తానని గాంధీజీ బందీ గృహంనుంచే ప్రభుత్వానికి పెద్ద లేఖ వ్రాశాడు

ఒక ప్రముఖ హరిజనోద్ధారకుని ఈ చర్య ఏమిటో ఉదారులకెవ్వరికీ అర్థంకాలేదు ఇలా జరిగిందంటే ఇప్పుడు అనేకురు నమ్మకపోవచ్చు కాని. ఇది జరిగిన వాస్తవం అయితే, హరిజనులు కాంగ్రెసులో భాగం అని, వేరే ఉండడం సహించకపోవచ్చును గాంధీజీ

20 సెప్టెంబర్ 1932 నుంచి గాంధీజీ ఉపవాసం ఆరంభమయింది దేశం

సంచలనం చెందింది ఈ విషయంపై ప్రభుత్వంతో చర్చలు ఆరంభమైనవి ఇది అంబేద్కర్‌కు పరీక్షా సమయమైంది

గాంధీజీ ప్రాణాన్ని రక్షించాలనుకునే వాళ్ళు, వారి మెప్పు పొందాలని భావించేవాళ్ళు,పండిట్ మదనమోహన మాలవ్యా అధ్యక్షతలో ఒక బహిరంగసభ ఏర్పరిచారు

ఆ సభకు ఆహ్వానంపై వెళ్ళి అచంచల కార్యదీక్షా పరుడైన డా॥ అంబేద్కర్ స్థిరచిత్తంతో ఇలా ఉద్ఘాటించాడు.- "గాంధీజీ ప్రాణాలు రక్షించేందుకు అన్ని విధాలా కృషి జరగాలి కాని దళితుల- అస్పృశ్యుల పక్షంనుంచి నేను ప్రక్కకు తొలగాలనే కోరిక మాత్రం ఉంచుకోకండి- పూనా ఒప్పందంలో గాంధీ స్వయంగా అస్పృశ్యులకు ప్రత్యేక ప్రతినిధిత్వం ఇవ్వాలనే విషయాన్ని అంగీకరించారు తిరిగి ఈవ్యతిరేకతకు ఎందరు పూనుకొన్నారో తెలియదు ఈ ప్రత్యేక అధికారంతో అంటరానివాళ్ళు హిందూ మతం యొక్క భాగంగానే కల్సి ఉంటారు దీనిలో ఎంతమాత్రం సందేహంలేదు

ప్రత్యేక ప్రతినిధిత్వానికి అంగీకరించం కాని, అస్పృశ్యులకు సురక్షిత స్థానాలకు ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నామని, కాంగ్రెసు వాళ్ళు డా॥ అంబేద్కర్ దగ్గరికి రాయిబారం పంపించారు

"ఈ నాటకం బాగుంది, కాని, నేను ఏదైతే దళిత జాతికి హితమైందని భావించానో దానిలో ఒక అంగుళం కూడా ప్రక్కకు జరుగను నా ఉద్దేశ్యాన్ని విరమించుకోను అన్నాడు దళిత జన నాయకుడు

గాంధీజీ ప్రాణసంరక్షణ కోసంగా తన పంతాన్ని వదులుకోవలసిందని డా॥ అంబేద్కర్‌పై అన్ని వైపులా అభ్యర్థనలు ఒత్తిడులు రాసాగాయి చక్రవర్తి రాజగోపాలచారి మధ్యవర్తిత్వంలో ఇద్దరికీ నచ్చే ఒప్పందాన్ని ఆమోదించాడు అంబేద్కర్

అది ఆయన ఉదాత్త మానవత్వానికి నిదర్శనం

## జాతీయ స్థాయిలో సీట్ల ఒప్పందం—

ఒప్పందంలో జాతీయస్థాయిలో కాంగ్రెసుతో 71 సీట్లను అస్పృశ్యుల కోసం కేటాయించుకొన్నాడు ఇది ఎన్నడూ కానీ తమకోసం వేరే ప్రాతినిధ్యము కావాలని కోరలేదు అంతకే సంతృప్తి చెందాడు కావలసింది ప్రభుత్వాధికారంలో భాగస్వామ్యం జనాభా ప్రాతిపదికలపై లభించినా చాలు అనే కోరుకొన్నాడు

ప్రత్యేక ప్రాతినిధ్యం సాధించీవదిలేశాడు అది అతనిఅపజయంకాదు
చెల్లి యుండియు సైరణ చేయునతడు -విజేత।

పూనా ఒడంబడికలో 148 సీట్ల ఒప్పందం ఉండే ప్రతి స్థానానికి నలుగురు వ్యక్తులను ఎస్ సి లను నిర్ణయించి వారిలోంచి ఒకర్ని ఎన్నుకొని పోటీకి నిలపాలని నిశ్చయించారు

## గాంధీజీ కారాగార విముక్తి- హరిజన సేవ—

గాంధీజీ జైలునుంచి విడుదల లభించింది అయితే రాజకీయరంగంలో పాల్గొనరాదనే నిబంధన పైననే ప్రభుత్వం ఆయనను విడిచి పుచ్చింది

ఇప్పుడాయన అస్పృశ్యులకొరసం సముద్ధరణకోసందేశమంతా తిరిగాడు
"హరిజన సేవక్" అనే పత్రిక స్థాపించాడు

హరిజనుల ఉన్నతికోసం చందాల సేకరణకు పూనుకొన్నాడు ఆ ప్రభావిత నాయకుడు ఎంతగా ప్రయత్నించినప్పటికీ ఎనిమిది లక్షల రూపాయలకు మించి పోగుకాలేదు

గాంధి కేవలం హరిజనుల ఉద్ధరణకు పూనుకున్నాడు. అంబేడ్కర్ అంటరానితనాన్నే రూపుమాప సంకల్పించుకున్నాడు



# మజ్దూర్ పార్టీ ఏర్పాటు

1936 ఎన్నికలకు ముందు అంబేడ్కర్ ఒక కొత్త "కూలీల కార్మికుల సంఘం"ను "మజ్దూర్ పార్టీ" పేరుతో ఏర్పాటు చేశాడు అదే "స్వతంత్రి మజ్దూరీ దళం బొంబాయిలోని 175 సీట్లలో 25 అంటరాని వాళ్ళవి.పై నూతన పార్టీ 17 మంది పోటీకి నిలబడినారు 17 సీట్లలో 15 గెలుపొందినట్లు 17 ఫిబ్రివరి 1937 నాడు పలితాలు తెల్పి దేశంఆశ్చర్యపడింది కాంగ్రెసుహరిజన అభ్యర్థులకు ఆ పోటీల్లో కేవలం రెండు స్థానాల్లో గెలుపు సాధ్యమయిందంటే వింతకదూ

దీనితో డా॥ అంబేడ్కర్ కేవలం అస్పృశ్యుల నాయకుడే కాదు కూలీజన నేత అని దేశం గుర్తించింది

---

19 జూలై 37న బొంబాయిలో కాంగ్రెసు ప్రభుత్వం నెలకొంది

కాంగ్రెసు హయాంలోకూడా బ్రిటిష్ ప్రభుత్వంలో వలెనే మిల్లు యజమానుల అత్యాచారాలు పెరిగాయి కూలీలంతా డా॥ అంబేద్కర్ నాయకత్వములో మిల్లుస్వాముల దమన నీతికి వ్యతిరేకంగా ఆందోళన ప్రారంభించాలని కోరారు డా॥ అంబేద్కర్‌కు కార్మిక శక్తి తెలుసు ఆందోళనకు పూనుకొని బంద్‌కు పిలుపిచ్చాడు ప్రభుత్వం హెచ్చరికలనూ కార్మికులు లెక్క చేయలేదు సమ్మె సఫలమయింది.

కార్మిక నేతగా అంబేద్కర్ విలువ పెరిగింది

అంతవరకు ప్రభుత్వ ఉద్యోగాల్లో వలెనే ఫ్యాక్టరీలలోనూ అనేక స్థానాలకు అస్పృశ్యులను తీసుకునే వారు కాదు కనీసం రైల్వేస్టేషన్లలో కూలీలుగానూ వీరినిరానిచ్చేవారు కారు- ప్రయాణీకుల సామాన్లు ముట్టుడుఅవుతాయనేమో.

వాటినన్నింటినీ ఎదిరిస్తూ నిలిచాడు అంబేద్కర్

14 ఏప్రిల్ 42న బొంబాయిలో కార్మికుల 25వ, మహాసభలు నిర్వహించాడు దానిలో కేవలం అస్పృశ్యులే కాదు హరిజనులతోపాటు ఇతర హిందువులూ అధిక సంఖ్యలో చేరారు డాక్టర్ అంబేద్కర్‌ను దేశనాయకునిగా ముఖ్యంగా మహారాష్ట్ర భాగ్యంగా అభివర్ణించారు

ఇతర పలు పార్టీల-నేతలవలె అంబేద్కర్‌ది ఒంటి కంటి చూపుకాదు మొత్తము-దేశం సమాజంలోని ప్రతిరంగంలో క్రాంతిని కాంక్షించాడు- సమర్థించాడు ఆయన పరిశ్రమ పెరుగుతూ ఆయన ఖ్యాతి దినదినము పెరుగ సాగింది

---

# వైస్రాయి కౌన్సిల్ మెంబరయ్యాడు

2 జూలై 1942 భారతదేశ చరిత్రలో మరచిపోరాని దినం. ఢిల్లీ వైస్రాయి తన కౌన్సిల్‌కు అంబేద్కర్‌ను ఒక హరిజనుని మెంబర్‌గా తీసుకున్నాడు

ఆ దినం పట్టరాని ఆనందంతో దళితులందరూ తమ నాయకునికి సన్మాన పూర్వకంగా పెద్ద ఊరేగింపు తీశారు

ఆయన మద్రాసు మొదలైన పలుప్రాంతాల్లో పర్యటించి దళితుల స్థితి గతులు తెలుసుకొన్నాడు

1942లో గాంధీజీ "భారత్‌ఛోడో" ఉద్యమం ప్రారంభించాడు ఆ సందర్భంలో గాంధీతోపాటు అనేకులు చిన్న పెద్ద కాంగ్రెసు నాయకులు అరెస్టు చెయ్యబడ్డారు

21 ఫిబ్రవరి 43నాడు గాంధీజీ ఆగాఖాన్ ప్యాలెస్‌లో 12 రోజుల ఉపవాసదీక్ష ప్రారంభించాడు ఆ దేశ నాయకునికి సమర్థనగా వైస్రాయి కౌన్సిల్ సభ్యులు పలువురు రాజీనామా చేశారు అంబేద్కర్ మాత్రం ఆ పని చేయలేదు తాను సభ్యుడుగా కౌన్సిల్‌లో కొనసాగుతూనే ప్రజాసేవ చేయాలని సంకల్పించుకున్నాడు

ఆయన కృషి మూలంగానే రైల్వేపోస్టల్ మొదలైన అన్ని ఉద్యోగాల్లో 8 33 శాతం ఉద్యోగాలను హరిజనుల కోసం ప్రభుత్వం కేటాయించింది 12.7శాతం ఉద్యోగాలు తమ వారికి కావాలని అంబేద్కర్ ప్రయత్నాలు సాగించాడు

భారత జన సంఖ్యలో హరిజనులు 9 శాతం

## సొంత భవన నిర్మాణం

బొంబాయిలో దాదర్ వద్ద "రాజగృహం" పేర సొంత భవనం కట్టు కున్నాడు అంబేద్కర్ తాను బారిస్టర్‌గా సంపాదించిన డబ్బు ఉద్యమాల నిర్వ హణకుపోనూ మిగిలింది ఇలా సద్వినియోగం చేసుకున్నాడు

అది నివాస గృహం అనేకంటే గ్రంథాలయ భవనం అనటంఉచితం తన పుస్తకాలు భద్రపరచడానికి చదువుకోడానికి వీలుగా ఉండే పద్ధతిలో దాన్ని నిర్మించుకొన్నాడు ఆ అపూర్వ మేధావి అపార గ్రంథరాశిని సమకూర్చు కొన్నాడు

ఆయన మామూలుగా కాదు చక్కగా నేర్చుకొన్న భాషలు మరాఠీ, హిందీ, ఉర్దూ, పార్సీ, గుజరాతీ, బెంగాళీ, సంస్కృతం,ఆంగ్లం, ఫ్రెంచి,జర్మన్, రష్యన్.

నిరంతర పుస్తక పఠనం విజ్ఞాన సముపార్జనం ఆయన నిత్య కృత్యాలు

ఇప్పుడు హైదరాబాద్ బంజారా హిల్స్‌లో ప్రముఖ పాత్రికేయుడు రచయిత కీ శే నార్ల వెంకటేశ్వరరావుగారి "లుంబిని" భవనం కూడా అంతే ఆ మూడంతస్తులమేడ అంతటా అసంఖ్యాక పుస్తకాలతో నిండి ఒక విలువైన గ్రంథా లయం వలె ఉంది- నేత్ర పర్వంగా

సొంత గృహాలు ఇంకెవరివైన ఇలా ఇండియాలో ఉన్నాయేమో నాకు తెలియదు. ఉండవనే నా విశ్వాసం

## భార్య మరణం—

సదాపతిసేవ, నిరంతరం వ్రతాలు, ఉపవాసాలతో దేహం కృశించింది

అనారోగ్యం పాలయింది అంబేద్కర్ సతీమణి రమాబాయి ఏకైక పుత్రుడూ మరణించాడు ఆ బెంగతో ఆరోగ్యం మరీ వికటించి 1935లో ఆమె కన్ను మూసింది ఆమె పండరినాథుని భక్తురాలు, ఈ సంఘటనతో అంబేద్కర్ మనస్సు చాల వికలమయింది అంతులేని వేదనను అనుభవించారు కాషాయవస్త్రాలు ధరించి వైరాగ్య భావంతో మెదలసాగాడు

అయినా ఆయన ప్రజాసేవ ఆయనను ఊరోక్కనీయలేదు 1936లోనే "లేబర్ పార్టీ"ని స్థాపించాడు

## రాజకీయాల్లో

ఏటికి ఎదురీదడమే ధీరగుణం
కన్నీటికి వెత చెందడమే పిరికితనం

ఎన్ని ఎదురు దెబ్బలు తగులుతూ గుండెను గాయపరచినా వాటినిలెక్క చేయక తన పనిలో నిమగ్నమై ఉండేవాడు.

పతితుల్లారా భ్రష్టుల్లారా
బాధా సర్ప దష్టుల్లారా
పదండి ముందుకు పదండి ముందుకు
పదండి తోసుకు పైపైకి (శ్రీశ్రీ)

అన్నట్లు వెనుకడుగు వేయని పురోగమనం సాగించేవాడు డా॥అంబేద్కర్

తాను పై్రసాయి కౌన్సిల్లో మెంబర్‌గా ఉన్నప్పుడు ఒకసారి పూరీ జగన్నాథ స్వామి ఆలయానికి వెళ్ళారు అక్కడికి పూజారులు "ఈ మందిరం అస్పృశ్యులకోసం తెరచిలేదు" అని ఆయన ప్రవేశాన్ని నిషేధించారు

మంచి చెడ్డలు మనుజులందున
యెంచి చూడగ రెండె కులములు
మంచి యున్నది మాలయైతే
మాలయే అగుదున్ - గురజాడ

మాల మాలగాడు మహిమీద నే ప్రొద్దు
మాట దిరుగువాడు మాలగాక
వాని మాల యున్నవాడె పోపెను మాల
విశ్వదాభిరామ వినురవేమ



ఆత్మజ్ఞానంతో శంకరాచార్య హరిజనుని పాదాలకు ప్రణమిల్లాడు

రామానుజుడు, పెరియనంబి అనే అత్యంత వైష్ణవునికి అగ్ని సంస్కారము కావించాడు బౌద్ధం వర్ణ కుల విభేదాలు పాటించక వివేకానికి సౌశీల్యానికి విలువ నిచ్చింది

మనవాళ్ళ మనస్సులు మాత్రం మైలతొలగించుకోలేదు నాడు అంబేద్కర్‌నే కాదు ఈ మధ్యనే మంత్ర కూట రాఘవేంద్ర స్వామి మందిరానికి మసాలా వీరన్న అను రాజకీయ నాయకునికి పూజారులు రానీయని వైనం పత్రికల్లో చూడలేదూ!

అదే వ్యధతో "షెడ్యూల్డు క్యాస్ట్ ఫెడరేషన్" స్థాపించాడు

4 జూన్ 1946లో గొప్ప సభ జరిపాడు.

16 జూన్ 46కు ప్రభుత్వం హిందూ ముస్లింలకు సమాన ప్రాతినిధ్యం ఇచ్చింది, హరిజనులను మరచిపోయింది

అందుకు నిరసనగా అంబేద్కర్ అహింసాత్మక ఆందోళనలకు పూనుకున్నాడు బొంబాయి, పూనా, వార్ధా నగరాల్లో పెద్ద ఊరేగింపులు తీశాడు దానితో దళితుల్లో ఏకత పెరిగింది

హిందువులు ముస్లింలు కలిసి బ్రిటిష్ ఆధీన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసే యోచన చేశారు దానికి బాధపడి బాబాసాహెబ్ తమకు కనీసం రెండు స్థానాలైనా ఇవ్వండని బ్రిటిష్ ప్రధానికి ఫోన్‌చేసి, సాధించాడు

20 డిసెంబర్ 46న డా॥ సచ్చిదానంద సింహ అధ్యక్షతన విధానసభ ప్రారంభమైంది అంతకుముందు పదకొండు తేదీన భారత రాష్ట్రపతిగా డా॥ రాజేంద్రప్రసాద్ ఎన్నుకోబడ్డాడు

అంబేద్కర్ బెంగాల్ విధానసభ నుంచి దళితవర్గ ప్రతినిధిగా ముస్లింల సహకారంతో ఎన్నికై ఢిల్లీ విధాన పరిషత్తులో ప్రవేశించాడు

19 జూలై 46 నాడు సర్దార్ వల్లభాయ్ పటేల్ ద్వారా విధానసభలో "అస్పృశ్యతా నివారణ బిల్లు" ప్రవేశపెట్టబడి ప్యాసయింది దానివల్ల దేశంలో అంటరానితనం నేరమై దండనకు పాత్రమయింది

1947 జూలైలో పండిత జవహర్‌లాల్ నెహ్రూ స్వతంత్ర భారత ప్రభుత్వంలో న్యాయశాఖ మంత్రి పదవిని నిర్వహించవలసిందిగా అంబేడ్కర్‌ను కోరాడు

15 ఆగస్టు 1947 నాడు భారతదేశానికి స్వాతంత్ర్యం లభించింది

14 ఆగస్టు 47 నాడే పాకిస్తాన్ స్వేచ్ఛారాజ్యంగా విడిపోయింది

నూతన భారత ప్రభుత్వంలో డా॥ అంబేడ్కర్ న్యాయశాఖామాత్య పదవి చేపట్టాడు

## భారత రాజ్యాంగ నిర్మాణం—

19 ఆగస్టు 1947న "భారత రాజ్యాంగ నిర్మాణం' కోసం ఒక కమిటీని ఏర్పాటుచేసి దానికి అధ్యక్షునిగా అంబేడ్కర్‌ను ఎన్నుకున్నారు ఆ కమిటీలో ఆరుగురు సభ్యులు వారంతా అంబేడ్కర్ అధ్యక్షతకు విముఖత చూపారు

అయినా నిర్విరామంగా దీక్షతో మూడేండ్లు శ్రమించి 8 అధ్యాయాలు 315 సూత్రాలతో బహు సూక్ష్మ పరిశీలనగా అంబేడ్కర్ రాజ్యాంగాన్ని రూపొందించి ప్రభుత్వానికి సమర్పించాడు అప్పుడు ఆయన పలికిన మాటలివి

"నేను విధానపరిషత్తుకు ఎందుకొచ్చానంటే కేవలం దళిత జాతుల సముద్ధరణకోసం దీనికి మించి నాకెకోరికా లెదు కాని ఇక్కడికి వచ్చిన తరువాత

నేనెంత మాత్రం ఊహించని బాధ్యతలను నాపై వేసారు విధాన పరిషత్తు నన్ను రాజ్యాంగ చట్ట నిర్మాణ సంఘ సభ్యునిగా ఎన్నుకున్నందుకె నేను వింత పడ్డాను సమితి నన్ను అధ్యక్ష స్థానానికి ఎందుకొన్నప్పుడు నా ఆశ్చర్యానికి అంతులేదు వీరందరూ నన్ను ఎంతగానో విశ్వసించి ఈ కార్యం నాతో చేయించారు. సమితి సభ్యులు నాకు ఇలా దేశసేవ చేసే అవకాశం కలుగజేసినందుకు వానికి నా కృతజ్ఞతలు రాజ్యాంగం ఎంత మంచిగానైనా రూపొందించుకోసి, దాన్ని అమలుపరచే వ్యక్తులు మంచివాళ్ళుకాకపోతే తప్పక చెడుదిగా అవుతుంది ఒకవేళ మనం ప్రజాస్వామ్యన్ని స్థాపించదలచుకుంతే, మన సామాజిక ఆర్థిక సిద్ధాంతాల్లో అహింసాత్మకమైన త్వరిత విధానాలను ప్రతిష్టించుకోవాలి స్వేచ్ఛ సమత సోదరత్వంలపై



ఆధారపడి ఉన్న జీవితమే ప్రజాస్వామ్యం అనబడుతుంది. భారతదేశంలో సమానత్వం పూర్తిగా సున్న, రాజకీయాల్లో మనకు సమానత లభించింది కాని, సామాజిక ఆర్థిక జీవనంలో విషమత్వమే ప్రకటితమవుతున్నది.

ఈ దినం మనకు మనమే ఒక దేశంగా భావించుకుంటే అది ఆత్మ వంచనే అవుతుంది వేలకొంది జాతులు—ఉపజాతులు ఉండగా ఇది ఒక్క దేశం ఎలాగవుతుంది? ఇలాంటి సమస్త బాధలను తొలగించుకొని మనం ఒక బలమైన దేశాన్ని రూపొందించుకోవాలి

డా॥ అంబేద్కర్ రచించి విధాన పరిషత్తుకు సమర్పించిన "రాజ్యాంగం" అభినందనలతో ఆమోదింపబడింది

విధాన పరిషత్ అధ్యక్ష స్థానం నుంచి డా॥ రాజేంద్రప్రసాద్ ఆ సమయాన అంబేద్కర్‌కు కృతజ్ఞతతో ఇలా అన్నాడు

"అధ్యక్షస్థానంలో కూర్చుని నేను ప్రతిదినం పనిని ధ్యానపూర్వకంగా చూచేవాడిని అందుకే డా॥ భీమారావ్ అంబేద్కర్ ఈ కార్యాన్ని ఎంతటి పట్టుదల నిష్ఠ ఉత్సాహంతో చేశారో ఇతరులకన్న నాకు చక్కగా తెల్సు డా అంబేద్కర్‌ను రాజ్యాంగ నిర్మాణ సమితిలో చేర్చుకొని, ఆ తర్వాత దానికి అధ్యక్షులుగా ఎన్నుకోవటం అంతటి మంచి పని మరేదీ చేయజాలము "

మను స్మృతిని తగలబెట్టాలన్న అంబేద్కర్‌ను అభినవమనువుగా కీర్తించారు జనం ఆ రాజ్యాంగంలో స్త్రీలకు పురుషులతో సమాన హక్కులు పొందుపరచడం విశేషం దానికి కొందరు నిందించారు కూడా చిత్తశుద్ధిని నమ్ముకున్న అంబేద్కర్ అవేవీ పట్టించుకోలేదు

11 జనవరి 1950న "దళితజాతులసంస్థ' ఆయనకు సన్మానం జరపడం విశేషం కాకపోయినా-

5 జూన్ 1952లో ఇదే కారణంగా కొలంబియా విశ్వవిద్యాలయం డాక్టరాఫ్‌లా బిరుదునిచ్చి ఆయనను సత్కరించడం విశేషమే

12 జనవరి 1953లో ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆ మేధావికి డాక్టర్ ఆఫ్ లిటరేచర్ పట్టానిచ్చింది ఇవి ఆయన ప్రతిభకు నిదర్శనాలు

## మంత్రి పదవికి రాజీనామా –

30 జనవరి 1948న గాంధీజీ హత్య జరిగింది. విభేదాలు విస్మరించి అంబేద్కర్ సానుభూతి ప్రకటించాడు

26 జనవరి 1950 నాడు మనదేశం సర్వతంత్ర స్వతంత్ర ప్రజాస్వామిక దేశమైంది-

అంబేద్కర్ రచించిన రాజ్యాంగాన్ని ఎందరు ఎంతగా ప్రశంసించినా "హిందూకోడ్' మాత్రం విధాన పరిషత్తులో ఆమోదం పొందజాలక పోయింది 51 ఫిబ్రవరి 5, పార్లమెంట్ చర్చ జరిగింది

ఇది ఆమోదించబడకపోతే నేను నా పదవిని వదలుకొంటానని ప్రధాని నెహ్రూ పట్టుపట్టారు అయినా అది ఆమోదింపబడలేదు ప్రధాని పదవినుంచి తప్పుకోలేదు

అంబేద్కర్ 1951లో అక్టోబర్ పదకొండుకు తన మంత్రిపదవికి రాజీనామా పత్రం పంపించాడు అంతరంగంలో బాధపడినా నెహ్రూ దాన్ని ఆమోదించాడు

అలసిన హృదయానికి, అనారోగ్యపడిన శరీరానికి-విశ్రాంతిగా చికిత్సగా ఆయన అదే నవంబర్‌లో బొంబాయి చేరుకొన్నాడు

రాజగృహం తిరిగి కళకళలాడింది ।

## అపూర్వభాగ్యం -

1961 ఏప్రిల్ 14 నాడు అంబేడ్కర్ 61 జన్మదినం అభిమానులు ఘనంగా జరిపారు అనాడు మరో విశేషం జరిగింది ఢిల్లీలో "అంబేడ్కర్ భవనం" నిర్మిస్తూ దానికి ఆయనచేతనే పునాదిరాయి వేయించారు తన పేర నిర్మించే (సారక) భవనానికి తానే శంఖుస్థాపనచేసే అపూర్వావకాశం ఎందరికి లభిస్తుంది.

ఆ మరుసటి దినం (15 ఏప్రిల్) వైశాఖ పూర్ణిమ "బుద్ధ జయంతి"నాడు జరిగిన సభలో డా॥ అంబేడ్కర్ హిందూ వర్ణవ్యవస్థను తీవ్రంగా ఖండించాడు అది హిందూ పండితుల-నాయకుల కోపా.కి కారణమైంది

అదే ఆయన పదవీ త్యాగానికీ దారితీసింది అయినా విచారించలేదు "నేను నా స్వార్థం కోసం ఏనాడూ ప్రయాస పెట్టుకోలేదు దేశం-జనం విషయంలో ఏనాడూ వెనుకబడి లేను, ముందే ఉంటాను ' అదీ ఆయన సిద్ధాంతం

## విచిత్ర ఆదర్శ వివాహం -

అంబేడ్కర్ భార్య రమాదేవి 1935లో మరణించడంతో చాలకాలం వరకు ఆయన విచారంతో గడిపినా, తిరిగి రాజకీయరంగంలో సంచలనాత్మక పాత్ర నిర్వహించాడు

అంబేడ్కర్ 55వ ఏట 1946 లో పునర్వివాహ ప్రస్తావన వచ్చింది ఆయన అంగీకరించేవారు కాదేమో, కాని వధువు బ్రాహ్మణయువతి సవితాదేవి.

కులమెంచగా నేల గుణము కారణము, అనుకొన్న సుశీల,

బలమైన కారణాలు లేంది బ్రహ్మచర్యం పాటించడంలో ప్రయోజన మేముంటుంది ?

అంబేడ్కర్ వివాహం జరిగింది ఒక అంటరానివాడుగా కేవలం కులం కారణంగా సమాజంతో చిన్న చూపు చూడబడిన వ్యక్తి, ఆన ప్రతిభా పాండిత్య సద్గుణాల కారణంగా అగ్రజాతి కన్యను పెళ్ళాడగలిగారు. ఇది ఆయనకు సంతృప్తిని కలిగించిన విషయమని కొందరంటారు

రాజ్యాంగ నిర్మాణ సందర్భంలో పక్షపాతివైఖరి లేకుండా సమతతో వ్యవహరించడానికి ఈ వివాహ సంబంధం తోడ్పడి ఉంటుందని మరికొందరి అభిప్రాయం

అయినా ఆయన దళితజనోద్ధరణను వీడలేదు సాంప్రదాయక జనం ఆయనను నిందించడం మానలేదు

అంబేడ్కర్ త్యాగ వీరతల కారణంగానే అధోజగద్ సహోదరులు చైతన్యవంతులు కాగలిగారు, ప్రయోజనాలు పొందగలిగారు ఇప్పుడు హరిజనులు పొందుతున్న అనేక రాయితీలు - రిజర్వేషన్లు ఆయన కృషి ఫలితమే।

అంబేడ్కర్ అస్పృశ్యుల భాగ్యప్రదాత।

## రిపబ్లికన్ పార్టీ స్థాపన —

1952 లోక్‌సభ ఎన్నికలకు ముందు దళితజాతి ప్రయోజనాల కోసం "రిపబ్లికన్ పార్టీ'ని స్థాపించాడు. ఎంత శ్రమించినా అంబేడ్కర్ - ఆయన పార్టీ ఆ ఎన్నికల్లో ఓడిపోయారు. చిరునవ్వుతో అపజయాన్ని అంగీకరించాడు తన ఉద్యమాన్ని మాత్రం విరమించలేదు.

1952లో రాజ్యసభకు ఎన్నుకోబడ్డాడు.

మే 1954లో నాగపూర్ ఖాలీస్థలానికి తాను అభ్యర్థిగా నిలిచాడు అప్పుడు పోటీదారును నిలిపింది కాంగ్రెసువాళ్ళే తనతో కాంగ్రెసు పోటీకి నిలవడమా ? ఇది కాంగ్రెసువారి హరిజన ప్రీతిని ఉద్ధరణను చాటించే విషయంగా భావించాడు విచారించాడు వారిది కపటనాటకంగా గ్రహించి అన్నాడిలా "సవర్ణ హిందువుల ప్రీతికోసం గాంధీ - ఆయన కాంగ్రెసు నా రాజకీయ జీవితాన్నే సమాప్తిచేశారు-"

తనను హిందువులు - కాంగ్రెసు నాయకులు వేదిస్తున్న తీరుకు విచారించాడు అంటరానితనం ఈ దేశానికి శాపమా అని పరితాపం చెందాడు.

"దౌర్భాగ్యంవల్ల నేను హిందూ సమాజంలో పుట్టాను అది నా స్వాధీనంలో లేని అంశం కాని. హిందూ సమాజంతో కల్సి ఉండడాన్ని వ్యతిరేకించడం నా స్వాధీనంలో ఉన్న విషయం నేను విశ్వసనీయంగా ప్రతిజ్ఞచేసి చెప్పే విషయమేమంటే హిందువుగా ఉండి మాత్రం మరణించను"

ఆ మేధావికి మానవతావాదికి ఎంత కష్టం కలిగితే అంతటి దృఢ ప్రతిజ్ఞ।

"మిమ్ము మాతో సమానంగా గౌరవిస్తాం, మమ్ము మీతో సమానంగా చూడండి చాలు" అని వీరంటే వారంగీకరించరే

"మీరు మాకంటే తక్కువ మీరు మమ్ము గౌరవించాలి, మేము మిమ్ము నీచంగా చూస్తాము" - అని వారంటే వీరెలా అంగీకరిస్తారు ? అలా అనడానికి నోరెలా ఆడుతుంది ?

వారికి ధర్మశాస్త్రాలు అలాగే చెప్పాయట వారికి ప్రయోజనం కలిగించే ధర్మాలను వారు మెచ్చుకోవచ్చునుగాక, మరి, వీరికి కష్టం నష్టం కలిగించే అంశాల వీరెందు కంగికరిస్తారు ?

# అంబేడ్కర్ రచనల గురించి—

శూద్రులెవరు? అనే పుస్తకంలో డా॥ అంబెడ్కర్ ఎన్నో పరిశోధనాత్మక విషయాలు వెలువరించాడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య త్రైవర్ణికులు ఆర్యులు మరి శూద్రులెవరు? వీరు పై మూడు వర్ణాలవారికి సేవగా పెట్టబడ్డారు



అంబేద్కర్ మాటల్లో ఈ విషయం గురించి

"భారతదేశంలో ఆర్యులు నాలుగు వర్ణాల్లో విభాగం చెందియున్నారు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు సమాజ నిర్మాణం ఈ నాలుగు

వర్ణాలపై ఆధారపడి వుంది ఈ మాటల్తో శూద్రుల సమస్య అర్థంకాదు సమాజం నాలుగు జాతుల్లా విభజింపబడి వుంటే దానివల్ల ఏ ఆపత్తూరాదు కాని దౌర్భాగ్య వశాన ఈ చాతుర్వర్ణ వ్యవస్థలో అనేక రహస్యాలు దాగిఉన్నాయి వీటిలో ఉచ్ఛ-నీచ భావనలున్నవి ఇది కేవలం మాటల వరకే కాదు, శాసనం శూద్రులు అందరికంటే క్రింది తరగతి వాళ్ళు, వారిపై ఇలాంటి నిబంధనలు విధించబడి ఉన్నాయికదా ఇక ఏనాడూ పైకి రాలేరు అంటరానివాళ్ళనే అయిదవజాతిరానంత వరకు శూద్రులే అందరికంటె నీచజాతి వాళ్ళుగా భావించబడేవాళ్ళు "

ప్రస్తుతం గౌరవస్థానంలో ఉన్న వాళ్ళు ఒకప్పుడు రాజరికాలు నెరపిన వాళ్ళు ఆయిన రెడ్లు వెలమలు కూడా శూద్రులే సుమండీ అనుమాన నివృత్తి కోసం మన ఆంధ్ర నిఘంటువులు చూడండి- రచయిత )

"ప్రజల దృష్టి శూద్రుల శక్తిని గ్రహించక పోవటానికి కారణం, వారి దృష్టి శూద్రుల జనసంఖ్య వైపు వెళ్ళకపోవటం దురదృష్టమేమో జనగణన లోనూ వారి సంఖ్య వేరుగా చూపబడదు " ఇలా ఉంది ఉపోద్ఘాతం

ఇది పరిశోధన గ్రంథం కాబట్టి సాంప్రదాయంగా వ్యాప్తిలో ఉన్న అంశాలపై విమర్శ ఉంటుంది దాన్ని ఖండించే వారూ ఉంటారు వారికి శక్తియుక్తులు కొల్లలు- వారిని ఇలా ఎదుర్కొన్నాడు డా॥ అంబేద్కర్

"హిందూ ధర్మశాస్త్ర రచయిత ఈ కాలపు శూద్రులు ప్రాచీనకాలపు శూద్రులు కారనే విషయింపై ధ్యాస ఉంచితే ఏ అన్యాయమూ జరుగదు ఎందుకంటే వ్రాచిన ధర్మాలు ఆ శూద్రులకోసం రూపొందించినవి అవి ఈ కాలపు శూద్రులపై ఎందుకు విధించబడుతాయి? ఈ విషయంశూద్రుల కొరకు తక్కువ ప్రభావం కలదికాదు ఒక వేళ శూద్రుల విషయం గురించి అన్వేషించ వలసి ఉందంటే- నాకు ఆ అధికారం ప్రాప్తించిందన్నట్లే

హిందువుల చరిత్ర ధర్మశాస్త్రాల జోలికి పోవద్దని నాకు కొందరు సలహా ఇచ్చారు

ఒకవేళ నాకు సంతృప్తిరాదు అంటే దానిని నేను అంగీకరిస్తాను కాని, సంస్కృతం రానంత మాత్రాన ఈ విషయం మీద నేనెందుకు వ్రాయలేను? సంస్కృతంలో చాలకొద్ది అంశాలే ఆంగ్లభాషలో లేనివి వున్నాయి అందుచేత సంస్కృత భాష తెలియక పోవడం ఈ అంశంపై నేను రాయడాన్ని ఆపజాలదు ఆంగ్లానువాద గ్రంథాలు పదిహేను సంవత్సరాలు చదివాను కాబట్టి నాకా అధికారం తప్పక ఉంది ఈ విషయంపై నాకు వ్రాసే అధికారం ఎంత వుందోఈ పుస్తకం ద్వారా తెలుస్తుంది ఎక్కడికి దేవదూతలు కూడా పోరో అక్కడికి మూర్ఖులు చొచ్చుకుపోతారని అంటారు దేవదూతలు ఒకవేళ నిద్రపోతే మూర్ఖులు తమ పని నిర్వహించాలి అందుకని నేనీ పుస్తకం రాయడం తగిందని భావిస్తున్నాను '

ఆయన రచనలపై కట్టు విమర్శలు వచ్చినై - అందుకే ఇలా అన్నాడు

"నేను వారి రోషాలను బెదిరింపులను లెక్కచేయను ఏవర్గమూ వాళ్ళంతటి స్వార్థపరులు కారు వాళ్ళు తమ జ్ఞానాన్ని స్వార్థంకోసం దురుపయోగం చేస్తున్నారు ఆశ్చర్యకరమైన విషయమేమంటే పెద్దపెద్ద విద్వాంసులు తమను నిష్పక్ష పాతులుగా చెప్పుకుంటూనే అలాంటి వారికి తోడు నిలుస్తున్నారు కాని, ఈ జడిపింపులకు నేను నా పని విరమించను వారు జాన్సన్ సూక్తిని ఉండరు- "నేను దుష్టుల బెదిరింపులకు బెదిరి అబద్ధీకులను పట్టడం మాను కోలేను-"

ఇలా ఆశించాడు

"ఒకవేళ వర్తమానపు వాళ్ళు నా పుస్తకాన్ని అంగీకరించకపోయినా, రాబోవు కాలం వాళ్ళు తప్పక ఒప్పుకుంటారు నాకు విజయం కోసం విచారం లేదు కాలం అనంతం- దేశం విశాలం ఏ కాలానికైనా నా మాటలకు విలువిచ్చే వాళ్ళు ఎవరో తప్పక పుడుతారు ఏమైనా కాని ఈ పుస్తకం ఛాందసానికి మాత్రం వ్యతిరేకమే '

ఎంతటి స్థిర నిశ్చయం!

"అస్పృశ్యులెవరు? ఎలా?

ఇది శూద్రులెవరు? పుస్తకానికి (1948 ప్రచురణ) శేషభాగమేనని రచయిత వ్రాశారు ఈ రెండు పుస్తకాలు తన రెండవ వివాహం తర్వాత వ్రాసినవే- బ్రాహ్మణ స్త్రీని పెండ్లాడినా ఆయన ధ్యేయంలో మార్పు లేదనడానికి ఇదో నిదర్శనం. మరణానికి రెండు మాసాల ముందు బౌద్ధుడుగా మారటం మరో ప్రబల నిదర్శనం

ఈ గ్రంథంలో ఆర్యులు వర్ణించిన మూడు అనాగరిక వృత్తులను పేర్కొన్నారు-(1) జరాయుమవృత్తివారు (చోరవృత్తితో జీవించే దేశదిమ్మరులు) సంఖ్య 2 కోట్లు, (2) ఆదివాసులు (నాగరిక వాసనలేని గిరిజనులు) ఒక కోటీ యేబది లక్షలు (3) అస్పృశ్యులు (హరిజనులు) 5 కోట్లు

ఆయా వృత్తుల పుట్టు పూర్వోత్తరాలను తన ఊహాశక్తితో సహేతుంగా వివరించి, వాటినలా ఉండాలని నిర్దేశించిన ఆర్యజాతిని ఆక్షేపించారు ఇలాగా

హిందూ సభ్యతలో వివేకం ఔన్నత్యం, పవిత్రతల గురించి ఏ అసత్యమైన విశ్వాసం ఉందో దానికి కారణం హిందూ విద్వాంసుల సామాజిక ఆధ్యాత్మిక శాస్త్రీలు నేడు సమస్త విద్యా వైపుణ్యం బ్రాహ్మల్లోనే ఉంది, కాని దౌర్భాగ్యమేమంటే ఇంతవరకు ఒక్క పండితుడూ ప్రగతి పథంలో ముందుకు వెళ్ళి వాల్తేర్ వలె కాలేకపోయారు వాల్తేర్‌లో నిజాయితీ ఉంది దాని కారణంగానే ఆయనపుట్టి పెరిగిన కేథలిక్ చర్చి సిద్ధాంతాలకు విరుద్ధంగా లేచి నిలబడ్డాడు .. బ్రాహ్మల్లో వాల్తేర్ ఎందుకు కాలేకంటే తుర్కీ-రాజు ఇస్లామీ మతాన్ని ఎందుకు నష్టపరచలేదు? ఏ ఒక్క పోపుకానీ కేథలిక్ చర్చిని ఎందుకు నిందించలేదు? బ్రిటిష్ పార్లమెంట్ నీలికళ్ళ పిల్లల చంపాలనే నిర్ణయం ఎందుకు తీసుకోలేదు? ఏ వ్యక్తికి కానీ తన-తనవర్గం యొక్క స్వార్థప్రయోజనము బాధించి వేస్తుంది బుద్ధీ ఆ దారినే పయనిస్తుంది"

సత్యశోధన, సమతాసాధన కోసం ఆయన గళానికి తోడుగా నిలిచింది ఆయన కలం ఫలితం సంఘ సంస్కారం అంతేకాని కాకమ్మ కథలు-కల్పిత గాథలు, దయ్యాలు-మంత్రాలు, నాగులు-యోగులు, వైపు ఆయన పోలేదు అజ్ఞానం మూఢవిశ్వాసాలు పెంచయినా సరే డబ్బు సంపాదించాలనే కోరిక ఆయనకు లేదు వివరాలు కావాలంటే అంబేద్కర్ పుస్తకాలు చదవండి

ఆదివాసా మనుష్యాః యే అర్థ విజాన చేతసా
ప్రతిష్ఠితాఖిలాదేవా నహి తిష్ఠంతి శాశ్వత (మానవగీత)

(ఆదిమకాలపు అర్థజ్ఞాన మానవులు సృష్టించిన ఈ దేవతలు శాశ్వతంగా ఉండజాలరు—) సత్యధర్మం మాత్రం నిలుస్తుంది

పురాతన హిందూ సమాజం భిన్న భిన్న జాతులను ఒకే జాతిగా-ఒకే మతంగా రూపొందించడానికి తమ గౌరవాన్ని కాపాడుకోవడానికి ప్రయత్నించి, అనుసరించిన తప్పితపు స్వార్థమార్గమే ఇన్ని విమర్శలకు కారణమవుతున్నది

ఆధునిక మానవులు విజ్ఞానం పెంపొందిన విశాల హృదయులు, కాబట్టి కులమతాలకు అతీతంగా నూతన సమాజ నిర్మాతలు కాగలరు

ఎల్ల లోకము వొక్క-యిల్లయ్, వర్ణ భేధములెల్ల కల్లయ్
వేలనెరుగని ప్రేమబంధము, వేడుకలు గురియ—
మతములన్నియు మాసిపోవును, జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును
అంతస్వర్గ సుఖమ్ములన్నవి, యవని విలసిల్లున్। (గురజాడ)

## అంబేద్కర్ అంతర్యం —

"దాస్యంలో ఉన్నవానికి అతడు బానిసగా ఉన్న సంగతి తెలుపు ఇక అతడే తొందరగా తిరగబడగలడు."

"రాజకీయ బలాన్ని సాధించడం కోసం తప్పుడు విధానాలను అనుసరించ కూడదు-"

"తప్పుడు మాటలముందు తలవంచి విచ్చుమడగడం సరియైన శాంతికాదు అది ఆత్మహత్యతో సమానం న్యాయమైన గౌరవప్రదమైన సమాజంలో అవసరమయ్యే ఆ ఆదర్శాన్ని, అరాచక ఆటవిక వాదులముందు వదలి వేయడమే మంచిది మనమీదికి ఎవరైనా దండెత్తి వస్తే యుద్ధంచేయక పోవడంలో అర్థం లేదు యుద్ధాన్ని ఆపుచేయడానికి ఆ యుద్ధంపై విజయం సాధించాలి అప్పుడే నిజమైన శాంతి నెలకొంటుంది మానవత అనేది దోషపూరితమైన ఆదర్శాలను దోపిడిని ఓర్చడానికి అనుకోవద్దు ఇలాగయితే చివరికి శాంతి-న్యాయం తప్పక విజయం పొందుతాయి '

"రాజకీయ దళాలను ఏర్పాటు చేసుకోవటంలోనే దేశ సంరక్షణ ఉంది ప్రభుత్వకార్యక్రమాలను కనిపెట్టి ఉండడానికి ప్రతిపక్షం ఉండటం తప్పని సరి లేకపోతే ప్రభుత్వం సులభంగా నియంతృత్వంలోకి మారిపోతుంది "

"మతం-ధర్మంలో ప్రార్థన, తీర్థస్థానాలు, పూజాపారాలు, ధార్మిక కర్మ కాండ, బలిదానాలకు చోటులేదు నీతి అనేదే మతం-ధర్మం. నీతిలేనిదేదీ ధర్మం కాజాలదు సాంప్రదాయిక మతవాదం ఈశ్వరుడు లేదా ఆత్మభావన, ఆధునిక ధర్మం ఆధారం మనిషి–నీతి?

"ఒకవేళ సమాజంలో చాలమంది కూడు గుడ్డ గూడులకు కొరతతో ఉంటే ప్రజాస్వామ్యం అసంపూర్ణంగా ఉన్నట్లే సామాజిక ఐక్యత, ఆర్థిక సమృద్ధి లేకపోతే ప్రజాస్వామ్య లక్ష్యం నెరవేరదు. దాని దృఢతకోసం సామాన్య ప్రజలయొక్క ఆర్థికస్థితి సాంఘిక స్థితి మెరుగుకావాలి '

"ఏ పనిలో కాని విజయం ఎంతగానైతే సాధనాలపై ఆధారపడి ఉంటుందో అంతగా న్యాయబద్ధమైన ధ్యేయం పైనా ఆధారపడి ఉంటుంది.ఉద్దేశ్యం మంచిదైనప్పుడు దాని విజయం కోసం అంతగా చింతించవలసిన పనిలేదు ఎందు కంటే అంతిమ విజయం సత్యానిదే సత్యాన్వేషికి అపారమైన సాహసం మరియు ఆత్మవిశ్వాసం ఉండాలి అలాంటి గుణాలు సాధారణంగా వ్యక్తికి మంచితనంలోనే

సహజంగా ఉత్పన్నమవుతాయి సత్యం విజయం పొందడానికి నిరంతరం స్వచ్ఛమైన పోరాటం అవసరం సత్యం కొరకు తీసుకొనే ఏ మహత్తర నిర్ణయాలైనా మంచివే అప్పుడు నిన్ను చంపటానికి వచ్చిన వ్యక్తి ఘోరమైన దుష్కార్మలు (స్త్రీల మానభంగం, దొంగతనం, మంది కొంపలు కాల్చటం వంటి పాడుపనులు) చేసి పట్టుబడిన వానివలె మరణిస్తాడు-"

"సమాజంలో ఘోరమైన దాస్యంతోను అమానుషమైన అన్యాయాలతోను పీడింపబడుతున్న జాతిలో నేను జన్మించాను దాన్ని తొలగించడంలో విఫలుడనైతే నన్ను నేను కాల్చుకొని ఈ జీవితాన్ని అంతం చేసుకుంటాను"

"జాతీయత అనేది తనది అనే భావానికి చేతనారూపం అది ఏకపక్షపు భావానికి లోను చేస్తుంది సాంఘిక అసమానతలు మొదలయిన వాటితో ఉత్పన్నమయ్యే ఆర్థిక సంఘర్షణ మొదలైన భావాలను అణచివేస్తుంది ఇతర సమాజాల వ్యక్తులను కలువనీయదు రాష్ట్రీయత భావసారం ఇదే"

"ధర్మం- మతం పేరుమీద అసమానతలను బలపరచడం చాల దౌర్భాగ్యం, అది ప్రగాఢమైన సోదర బంధుత్వం"

"మతం వ్యక్తిగతం అది వారి వారి ఇష్టాల బట్టి వ్యక్తిగత జీవితాల వరకే పరిమితం చేయాలి'

"ఏ వ్యక్తిగానీ మతాన్ని జనసాధారణ అంశంగా చేయవలసిన పని లేదు"

"ఏ సమాజ జీవనంలో కాని రాజనీతిది బలమైన స్థానం - ముఖ్యంగా ఆ సమాజానికి ఎన్నుకునే అధికారం ఉన్నపుడు ఆ సమాజం ఎన్నికలను ఎదుర్కోవాలి రాజకీయం తన శక్తి ద్వారా మన స్థితిని శాసించగలది"

"జీవితంలోని అన్ని రంగాల్లో మనిషికి మనిషికి మధ్య సంబంధాన్ని నెలకొల్పేదే ధర్మం లేదా సదాచారం ఏ వ్యక్తికానీ ధర్మానికి భిన్నంగా మెదల లేదు ఎందుకంటే సత్సంబంధం ప్రతివారికి ప్రతి సమయంలోనూ అవసరం-'

"మన సిద్ధాంతం అహింస అయినా అవసరమైన సమయాల్లో హింసను ప్రయోగించాలి "

## విద్యాలయాల స్థాపన—

ఒకవైపు సమాజంతో మరోవైపు ప్రభుత్వంతో పీడితులకోసం అధోజాతి సోదరుల సముద్ధరణ కోసం తీవ్ర పోరాటం సాగించాడు డా॥అంబేద్కర్

పశువులను కూడా నీరు త్రాగటానికి అంగీకరించుతూ జాతిభేదం కారణంగా తోటి మానవులనే నీరు ముట్టనీయని హిందువుల కాఠిన్యానికి నిరసనగా "చెవ్‌దార్ చెరువు వద్ద 1927లో సత్యాగ్రహం జరిపి ఫలితం సాధించాడు

నరులకే కాదు దైవానికీ తన సంతానంలో కొందరిపై ప్రేమ ఉండదనే అంశానికి నిదర్శనంగా హరిజనులకు ఆలయాల ప్రవేశం లేకుండేది అందుకు మదికుంది బాధిత హృదయాలకు ఊరటింపుగా,సవర్ణ హిందువులతో సమానులుగా భావించబడటానికి చిహ్నంగా నాసిక్ కాలారామాలయంలో 2-3-1929న హరిజన ప్రవేశం కోసం సత్యాగ్రహం చేశాడు— సాధించలేదు

1930లో మహార్‌జాతి పరిషత్తు నేర్పరిచాడు అదే యేడు "మజ్దూర్ పార్టీ'ని స్థాపించాడు

ఎన్ని చేసినా ఎంతగా పోరాడినా విద్యలేంది, విజ్ఞానం పెరగంది దళిత జన సమాజంలో మార్పు సాధ్యం కాదని భావించాడు

ఎవరో వేసిన సంకెళ్ళను వారినేవచ్చి తీసేయుండని ప్రాధేయపడటం కంటే, సత్తా పెంచుకొని వాటిని తమంత తామే ఛేదించుకోవడం మంచిపనిగా తలంచాడు

అందుకు విద్య మూలమని యెంచాడు

విద్యా వైద్య రంగాల్లో బౌద్ధం తర్వాత గణనీయమైన పాత్ర వహించింది క్రైస్తవం, ఈ చారిత్రక సత్యాన్ని ఆయన గమనించాడు

అందుకే విద్యాలయాల స్థాపనకు పూనుకున్నాడు

మరాఠ్వాడాకు నడిబొడ్డులాంటి ఔరంగాబాద్‌లో ఒక కళాశాలను స్థాపించాడు బొంబాయిలో సిద్ధార్థ కాలేజీని నిర్మించాడు

ఇంకా అనేక పట్టణాలలో విద్యాలయాలను నెలకొల్పాడు ఇది అంబేద్కర్ విద్యాప్రీతికి విశాల హృదయానికి దూరదృష్టికి చక్కని నిదర్శనం

గుడులు కాదు బడులే పూజామందిరాలు।

## బౌద్ధ ధర్మ స్వీకారం--

నేను హిందువుగా జన్మించాను కాని, హిందువుగా మాత్రం మరణించను, అని ప్రతినచేశాడు అంబేద్కర్ సమాజంలో ఆయన ఆశించిన మార్పు కనిపించితే ఆ మాటను మరచిపోవునేమో- అడుగడుగునా ఎదురయిన ప్రతిఘటనలకు ఆయన మనస్సు విసిగిపోయింది

'హిందూకోడ్ బిల్లును సవర్ణులైన హిందువులే పట్టుబట్టి వ్యతిరేకించడం ఆయనకు మరీ బాధ కల్గించింది ఇదింతేలే అనుకున్నాడు.

వేలేండ్ల వాసన ఊరకేపోతుందా?

ప్రతిభ విద్య సత్కార్యాల కారణంగాకాక, కేవలం జన్మకులం మూలంగానే ఆదరం- అర్చన లభించే అవకాశాల్ని మన మహనీయులు ఊరకే వదలుకుంటారా? స్త్రీని స్తుతించే శ్లోకాలు చదువుతూనే స్వసుఖాలకోసం వారిని దాస్యంలో ముంచి అణచి ఉంచే శోకాల పాలుచేసే ప్రబుద్ధులు ఉదార సంస్కార సమతా భావులవుతారా? కాలేదు కాక తప్పని కాలం ముందు రావచ్చు- వస్తుంది. కాని అంబేద్కర్ అలసిపోయాడు

తన ఆత్మ సంతృప్తి కోసం, కోట్లాది దళితజన విముక్తి కోసంగా మార్గదర్శిగా 14 అక్టోబర్ 1956 నాడు నాగపూర్‌లోని గొప్ప బహిరంగ సభలో సతీపుత్రసమేతంగా డా॥ అంబేద్కర్ బౌద్ధమత దీక్ష పొందారు అయిదు లక్షల

జనం ఆయనను అనుసరించారు ఆనాడు-



బుద్ధం శరణం గచ్ఛామి। ధర్మం శరణం గచ్ఛామి॥ సంఘం శరణం గచ్ఛామి॥।

బౌద్ధ త్రిశరణాల ధ్వనితో ఆ ప్రదేశం-ఆకాశం మార్మోగిపోయింది. మరుసటిదినం వార్తాపత్రికలన్నింటిలోనూ ఆ వార్త పతాక శీర్షికల్లో అలంకారమైంది.

అదొక అపూర్వ సన్నివేశం

సిద్ధార్థ గౌతమబుద్ధుడు- అజాతశత్రు, అశోక, హర్షవర్ధన ప్రభువులు స్మరణకు వచ్చారు పవిత్ర బౌద్ధారామాలు, త్రిపిటకాల పఠనం, బౌద్ధ సన్యాసుల సేవాదీక్ష స్మరణకు వచ్చింది

అంతకుముందు డా॥ అంబేద్కర్ 1950లో శ్రీలంకలోనూ, 1952లో

ర్మా రాజధాని రంగూన్‌లోనూ జరిగిన విశ్వబౌద్ధ సమ్మేళనాలకు వెళ్ళివచ్చాడు

అంబేద్కర్ బౌద్ధంలోనే ఎందుకు చేరాడు? అనే ప్రశ్నకు ముందు మరికొన్ని సందేహాలు ప్రశ్నలు ముందుకు వస్తాయి

హిందువుగా ఎందుకు ఉండలేదో మనకు తెల్సు వర్ణభేదం, కులనింద నీచదృష్టి స్వార్థ ప్రవృత్తులను ఆయన సహించలేకపోయాడు

ఇస్లామీ క్రైస్తవాల్లో ఎందుకు చేరలేదు? అంటే- అవి విదేశీమతాలు డా॥ అంబేద్కర్ విదేశాల్లో చదివినా విదేశీ దుస్తులు సూటుబూటు ధరించినా ఆయన మనస్సు స్వదేశీయం- శాంతరస పూర్ణం విదేశీ మతాలను అధ్యయనం చేశాడు అంబేద్కర్ న్యాయశాస్త్రంలోనే కాక విజ్ఞానశాస్త్రంలోనూ డాక్టర్ మతాలు వాటి పుట్టు పూర్వోత్తరాల గురించి విద్యార్థి దశనుండే పరిశోధన సలిపాడు

క్రైస్తవ-ఇస్లామీ మతాల పుట్టుకకు కారణాలు వేరు. ఆ కాలాలు వేరు ఆ ప్రవక్తల మనస్తత్వాలు వేరు ఎంతప్రేమను బోధించినా అవీ అంధ విశ్వాసాలపై రూపొందినవే

డా॥ అంబేద్కర్ సత్యాన్వేషి

సత్యాన్వేషకుడై, దైవాన్ని కాక ధర్మాన్ని-ప్రేమించి ఆచరించి ప్రబోధించిన బుద్ధుడు ఆయనకు ఆదర్శం అయ్యాడు ఆకర్షించాడు.

బౌద్ధం దాదాపు వెయ్యేండ్లు ఇండియానే కాదు ఆసియాఖండాన్నే తన ప్రభావంలో పడవేసుకొంది హిందూ మత విజృంభణతో మనదేశంలోనే వెనుకకు తగ్గింది కాని, శ్రీలంక, నేపాల్, సిక్కిం, భూటాన్, బర్మా, థాయిలాండ్ జపాన్ మొ॥ దేశాల్లో బౌద్ధం ఉంది మార్పునకు ముందు టిబెట్ చీనా బౌద్ధానివే

జన్మభూమి భారతదేశంలోనే బౌద్ధం ప్రభావం తగ్గినా మన ప్రభుత్వ చిహ్నం అశోక ధర్మచక్రం!

"అంబేద్కర్ ఏదో భావావేశంతో బౌద్ధధర్మాన్ని స్వీకరించలేదు ఆయన జ్ఞానవంతుడు, గుణవంతుడు, విద్వాంసుడు, దూరదృష్టికలవాడు, క్రాంతి కారి.

కావాలంటే ఆయన ఏ అన్యమతంలోనైనా చేరి విరోధుల ఆట కట్టించేవాడు- నోళ్ళు మూయించేవాడు కాని, అలా చేయలేదు భారత మతాన్నే స్వీకరించాడు ఏ విదేశీమతాన్ని ఆశ్రయించలేదు ఆయన పరిపూర్ణ వివేకంతో విశ్వాసంతో ఈ ధర్మాన్ని గ్రహించాడు "— సూర్యనారాయణ్ త్రిపాఠీ

సత్యాన్వేషణ, కఠోర దీక్ష ఆమరణ, దీన జనసేవ, ప్రబోధించిన బుద్ధునికి మించిన జ్ఞాని-కరుణామూర్తి ఎవరు?

బౌద్ధానికి మించిన సత్యధర్మం విశ్వంలో లేదు।

## అంతిమ యాత్ర —

డా॥ అంబేద్కర్ బౌద్ధ ధర్మదీక్ష గ్రహించడానికి కొంతకాలం ముందు నుంచే "బుద్ధుడు-బౌద్ధ ధర్మం" అనే గ్రంధరచన చేస్తున్నాడు,

అనారోగ్యం విశ్రాంతిలేని కార్యభారం వల్ల అది పూర్తి చేయడంలో ఆలస్యమైంది

5 డిసెంబర్ 1956 దినం ఆ గ్రంథం ముగించి పీఠిక కూడా వ్రాసి నిద్రించాడు అంబేద్కర్, అదే ఆయన దీర్ఘ నిద్ర అవుతుందని ఎవరు కలగన్నారు? అలాంటి అనాయాసేన మరణం ఎంతమందికి లభిస్తుంది- ఆయనకు లభించింది।

దళిత జన సముద్ధరణకై సకల మానవ సమతకై శాంతియుతంగా తీవ్రంగా నిరంతరం పోరాడిన ఆ కలం-గళం-మనోబలం లన్నీ చిరవిశ్రాంతి పొందాయి

ఆరవతేది సమాచార పత్రికల్లో ఆకాశవాణిలో ఈ వార్త అరణ్యాన్ని దావానలంవలె దేశమంతటా వ్యాపించింది జనం కుప్పలుగా విచారవదనాలతో అశ్రుపూరిత నయనాలతో తమ ప్రియతమనేత అంతిమ దర్శనానికై తరలారు

అంబేద్కర్ (అ) మృతదేహాన్ని ఢిల్లీ నుంచి బొంబాయి విమానంపై

తీసుకొచ్చారు అది ఆయన కార్యరంగస్థలం నాయకుని న్యాయపోరాటంలో ప్రాణాలను సునాయాసంగా అర్పించగల శిష్యులు వేలకొలది ఉన్న ప్రాంతమిది



రాత్రి 2 గం॥కు విమానం బొంబాయి చేరేసరికి లక్షల జనం వేచిఉన్నారు అయిదుమైళ్ళ దూరం శవయాత్ర వైభవంగా సాగింది త్రిశరణాల ఘోష మ్రోగింది

శవవాహిక శివాజీ పార్క్ చౌరాస్తాలో ఆగింది బాబాసాహెబ్ అంబేద్కర్ చివరికోర్కె పూర్తి చేయడానికి అప్పుడు లక్షల అభిమానులు బౌద్ధ దీక్ష స్వీకరించారు

అంబేద్కర్ గారి ఏకైక పుత్రుడు యశ్వంతరావు చితికి నిప్పంటించాడు

భౌతిక శరీరాన్ని హరిస్తూ వారికి ర్తివలె జ్వాల ఎగసింది శోకవిహ్వాల మూర్తియై స్తబ్దంగా నిలిచింది సవితా అంబేద్కర్।

ప్రముఖ మరాఠీ పాత్రికేయుడు అత్రే ఇలా ఆక్రోశించాడు- "ఓ ఆకాశ దేవతాలారా। రండి చూడండి తిరిగి మీకెప్పుడూ ఈ అద్భుత దృశ్యం కన్పించదు"

లక్షల జనం కృతజ్ఞతలతో బాబాసాహెబ్‌కు చివరిసారిగా బాష్పాంజలులు సమర్పించుతూ నిలిచారు

## స్మృత్యంజలి—

లోక్‌సభ అధ్యక్షులు గురుదయాల్ సింహ, శ్రీ శే అంబేద్కర్‌గారి తైలవర్ణ చిత్రాన్ని 6 డిసెంబర్ 72 న ఢిల్లీ నగరపాలక సభా భవనంలో ఆవిష్కరించారు అప్పుడు నగర పౌరుల పక్షాన కేదారనాథ సహానీ "శ్రద్ధాంజలి" భాషణతో ఈ మహనీయుని జీవితాన్ని-స్వభావాన్ని మరొక్కసారి స్మరించుకుందాం—

"డాక్టర్ అంబేద్కర్ సంపూర్ణ జీవితాన్ని మనం చూస్తే ఆయన బహుముఖ ప్రతిభావంతమైన వ్యక్తిత్వం యొక్క అనేక రూపాలు మన కనులముందు సాక్షాత్కరిస్తాయి వారు అత్యున్నత స్థాయి విద్వాంసులు, జనప్రియులైన న్యాయవాది ప్రజ్వలించే ఆలోచనాపరుడు గొప్ప విధి నిర్వాహకుడు, ప్రతిభగల రచయిత ప్రముఖ పాత్రికేయుడు రాజ్యాంగ మేధావి దళిత పీడితులను సమర్థించే మానవతావాది

ఆయన ఆలోచనా సరళిని కార్యరంగాన్ని సూక్ష్మంగా పరిశీలిస్తే హరిజనులపై సానుభూతి కలిగి ఉండడం కనిపిస్తుంది యువావస్థలోనే పేదల వకీలుగా పేరు పొందాడు ముప్పది మూడేండ్ల తరుణ వయస్సులోనే "బహిష్కృత హితకారిణీ సభ'ను స్థాపించి సమాజసేవలో ప్రవేశించారు దాని

తర్వాత బొంబాయి విధానసభలో, రౌండ్ టేబిల్ సమావేశాల్లో, "మంత్రి విధాన పరిషత్తులో, అసెంబ్లీలో, ఎక్కడైనా అస్పృశ్యులు, దరిద్రుల కోసం గొంతెత్తి వాదించి సహకరించాడు

రాజ్యాంగ చట్ట గ్రంథ నిర్మాణ సమితి అధ్యక్షులుగా వారు చరిత్రాత్మకమైన కార్యాన్ని నిర్వహించారు అది ఈ దేశంలోనే కాక విశ్వమంతటా సదా గౌరవ ప్రదంగా చూడబడుతుంది



వీటన్నిటికి మించి డా॥ అంబేద్కర్ ఒక సామాజిక క్రాంతికి మూల పురుషుడు వారు హరిజనులకు దళిత వర్గాలకు క్రొత్త చైతన్యం ఉత్సాహం ప్రదానం చేశారు యావజ్జీవితాన్ని వారి మానసిక- సాంఘిక స్థాయిని పెంచడానికి

అంకితం చేశారు రాజ్యాంగం ద్వారానూ వారు రాజకీయ, ఆర్థిక, సామాజిక సమానత్వ ఉన్నత సిద్ధాంతాలపై ఆధారపడిన ఒక గొప్ప స్వరూపాన్ని రూపొందించారు అక్కడ ఉన్నత-నీచ, ధనిక-పేద, అందరికీ సమానస్థాయి ఆదరం లభిస్తుంది ఒక స్వచ్ఛమైన విప్లవకారుడై తాము ఏదైతే సరియైనదని భావించారో దానికోసం ఎంత పెద్ద త్యాగాలు-బలిదానాలు చేయడానికైనా వెనుకంజ వేయలేదు వారు మంత్రి పదవికైనా రాజీనామా చేశారు కాని తమ సిద్ధాంతాలలో రాజీనామా మాత్రానికైనా అంగీకరించలేదు

డా॥ అంబేడ్కర్ స్వచ్ఛమైన దేశభక్తుడు ప్రజాస్వామ్య సమర్థకుడు విభిన్న అభిప్రాయాలను సదా ఆదర పూర్వకంగా గ్రహించాడు శత్రుత్వ భావనలో కూడా సభల్లో వాదన సందర్భాల్లో ప్రతి పక్షాల మాటలను శ్రద్ధగా వినేవాడు "

లోక సభాధ్యక్షులు శ్రీ గురుదయాల్ మాటల్లో- "డాక్టర్ అంబేడ్కర్ ఒక గొప్ప దేశభక్తుడని మనకందరికీ తెలుసు ఆయన మహానాయకుడు, దార్శనికుడు, భారత రాజ్యాంగ నిర్మాత భారతదేశపు గొప్పవ్యక్తుల్లో ఆయనొకరు, కోట్లాది దేశీయ మానవ హక్కులు పొందడానికి సంఘర్షణ పడ్డారు

ప్రజాతంత్ర సంరక్షణకు అనేక ఆందోళనలు నిర్వహించి రాష్ట్రీయ ఏకత (దేశ సమైకకత) కోసం కఠోర శ్రమ కావించారు

డా॥ అంబేడ్కర్ భారత రాజ్యాంగ నిర్మాణంలో అపూర్వ కార్యాన్ని సాధించారు వరుసగా మూడేండ్లు ఏ శ్రద్ధతో శ్రమించి ఈ రాజ్యాంగానికి రచనా రూపాన్ని ప్రసాదించారో, దీనికి భారతదేశంలోనే కాదు, ప్రపంచమంతటా కీర్తి లభించింది భారత ఇతిహాసంలో వారి చరిత్ర స్వర్ణాక్షరాలతో లిఖించ బడుతుంది

మనం వారిని కృతజ్ఞతా పూర్వకంగా స్మరించి శ్రద్ధాంజలులు సమర్పించు కుందాం।"

* * *